# శతపత్రం

(శ్రీశ్రీశ్రీ భద్రాద్రి సీతారామచంద్రస్వామివారి శతక సమాహారం)

ప్రథమభాగం



సంకలనం:

**శ్రీ ఎస్.టి.జి.అంతర్వేది కృష్ణమాచార్యులు**

ప్రచురణ

**శ్రీరామసేవాసమితి, న్యూఢిల్లీ**

శతపత్రం

(శ్రీశ్రీశ్రీ భద్రాద్రి సీతారామచంద్రస్వామివారి శతక సమాహారం)

ప్రథమభాగం

సంకలనం: శ్రీ ఎస్.టి.జి.అంతర్వేదికృష్ణమాచార్యులు

ప్రథమ ముద్రణ: అక్టోబర్, 2012

ప్రతులు: 1000

ముఖచిత్రం, లేఅవుట్స్:

తుంబలి శివాజీ, 9849227509

ప్రతులకు:

శ్రీరామసేవాసమితి,

ఎన్ ఐ ఎల్ 74 ఏ, మాలవ్యానగర్

న్యూఢిల్లీ-110 017.

ఫోన్: 011-26677037.

డిటిపి : వేణుగ్రాఫిక్స్, భద్రాచలం

ముద్రణ: గోత్ర ఆఫ్‌సెట్ ప్రింటర్స్, పార్వతీపురం



*శ్రీరామాయ నమః*
*శ్రీమతే రామానుజాయ నమః*

# శతపత్ర సౌరభం

**ఆం**ధ్రుల ఆరాధ్యదైవం భద్రాద్రి రాముడు. కళ్యాణ గుణనిధి అయిన ఆ స్వామిని కీర్తిస్తూ ఎంతోమంది ఎన్నో కృతులను కావించారు. కావిస్తున్నారు. అటువంటి కృతులలో శతకాలది ప్రత్యేక స్థానం. వంద శ్లోకాలు లేక వంద పద్యాలు, అంతకన్నా ఎక్కువగా ఉన్న కవిత్వ విశేషాన్ని **శతకం** అని అంటారు. వంద పత్రాలున్న (రేకులున్న) పద్మాన్ని (కుశేశయం) **శతపత్రం** అంటారు. మార్దవం, మాధుర్యం కల పూరేకుల లాంటి వంద శ్లోకాలు / పద్యాలతో ఉన్న శతపత్ర (శతక) సౌరభం సంస్కృత భాషలో అతి ప్రాచీనకాలంలోనే దాని గుబాళింపు మొదలందుకుంది. ఆంధ్రభాషలో అది విస్తృతంగా అందాలనద్దుకుంది. అలాంటి సంస్కృతాంధ్ర భాషలలో భద్రాద్రి రామునిపై వెలువడిన శతకాలను ఒకచోట చేర్చి, గ్రంథంగా కూర్చి **శతపత్రం** పేరిట సంకలనాన్ని వెలువరించడం ఎంతో హర్షనీయం.

ఈ సంకలనంలో భక్త రామదాసుగా పేరుగాంచిన కంచర్ల గోపన్న గారి **దాశరథీ శతకం,** మరో రామదాసుగా ఖ్యాతికెక్కిన శ్రీ రాజా తూము లక్ష్మీ నృసింహదాస **సంకలిత పద్య శతకం,** కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ వారి **భద్రగిరి శతకం,** భద్రాద్రి దేవస్థాన ప్రాక్తన కార్యనిర్వహణాధికారి శ్రీ కొండపల్లి రామచంద్రరావు గారి **సమక్ష రాఘవం,** శ్రీమాన్ నరహరి గోపాలాచార్య **భద్రగిరి దాశరథి శతకం,**, శ్రీ దేవవరపు రాఘవుల **భద్రగిరి రామ శతకం,** అనే ఆంధ్ర శతకాలతో....

సంస్కృత భాషలో ప్రముఖ కవి పండితులైన నీలకంఠ దీక్షితుని ప్రియ శిష్యుడైన రామభద్ర దీక్షితుని **రామచాపస్తవం, రామబాణస్తవం,**

మరో దాక్షిణాత్య పండితులైన బ్రహ్మశ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రి గారి **భద్రాద్రి రామ శతకం**, భద్రాద్రి దేవస్థాన జీర్ణోద్ధకణ కమిటీ సభ్యులైన శ్రీమాన్ ఎస్.టి.జి. వరదాచార్య స్వామివారి **అనువాద దాశరథీ శతకం**, (భక్త రామదాసు గారి దాశరథీ శతకానికి సంస్కృతానువాదం) అలాగే శ్రీ భీమరాజు సత్యనారాయణ **అనువాద దాశరథీ శతకం** (భక్త రామదాసుగారి దాశరథీ శతకానికి సంస్కృతాను వాదం) అనే సంస్కృత శతకాలతో.... విరాజిల్లుతున్నది.

ఇటువంటి సుమధుర శతకాలను సేకరించిన సంకలనకర్త చి॥ ఎస్.టి.జి. అంతర్వేది కృష్ణమాచార్యులు, ఈ గ్రంథముద్రాపకులు, నిత్య రామాయణ పారాయణపరులు, శ్రీ ఉలిమిరి వేంకట సోమయాజులు- శ్రీరామ సేవాసమితి వారి ఔదార్యం కూడా ఎంతో ప్రశంసనీయము.

భద్రాద్రి రామ శతక భరితమైన ఈ శతపత్ర సౌరభం భక్తజనులందరికీ భవ్యమైన ఆనందాన్ని అందించాలని ఆశిస్తూ...

*భద్రాద్రి రామ శ్రీచరణ సేవలో....*

**శ్రీమత్ తిరుమల గుదిమెళ్ళ శ్రీమన్నారాయణాచార్యులు**

అధ్యక్షులు, తిరుమల పీఠం మరియు

అధ్యాపకులు

శ్రీ సీతారామచంద్రస్వామివారి దేవస్థానంవారి

సంస్కృత పాఠశాల,

భద్రాచలం.



శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

#  శతపత్ర సమర్పణ 

**తె**లుగువారి ఇష్టదైవం మరియు వైకుంఠ నారాయణ స్వరూపుడు, సకలాభీష్ట ప్రదాత భద్రాద్రి శ్రీరాముడు. అటువంటి స్వామిపై వెలువడిన శతకాలను శతపత్ర కుసుమంగా శ్రీ సీతాలక్ష్మణ సహితుడైన ఆ స్వామి దివ్య చరణాలకు అర్పించిన సోదరులు **శ్రీ ఎస్.టి.జి. అంతర్వేది కృష్ణమాచార్యులు** ధన్యులు. వారి ఈ కైంకర్యంలో ఆ శతపత్ర కుసుమ సమర్పణ భాగ్యాన్ని నేను పొందాను. అది కృపాజలనిధి అయిన శ్రీసీతారామచంద్రస్వామి వారి దివ్యానుగ్రహంగాను, భాగవతోత్తముల మంగళాశాసనంగాను భావిస్తున్నాను.

ఈ సందర్భముగా ఈ గ్రంథానికి శతపత్ర సౌరభం పేరిట తమ అమూల్యమైన అభిప్రాయాన్ని అందించిన భద్రాచల దేవస్థాన సంస్కృత పాఠశాల అధ్యాపకులు **శ్రీమాన్ ఎస్.టి.జి. శ్రీమన్నారాయణాచార్య స్వామి** వారికి ప్రత్యేకంగా కృతజ్ఞతా దాసోహములను సమర్పిస్తున్నాను.

అలాగే ఈ గ్రంథ ముద్రణలో తమ సలహాలను అందించిన ప్రియ మిత్రులు భద్రాద్రి దేవస్థాన సామవేద పండితులు **శ్రీ డి.ఎస్.ఎస్. సన్యాసిశర్మ** గారికి కూడా కృతజ్ఞతలను తెలియజేస్తున్నాను.

మా 'శ్రీరామ సేవాసమితి' ద్వారా భద్రాద్రి రామునికి **సమర్పించిన ఈ శతపత్రం** శ్రీరామభక్త శిఖామణులకు, నిత్యపారాయణ గ్రంథముగా, మరియు శ్రీరామ సంకీర్తనా యజ్ఞంలో యజ్ఞ ద్రవ్యంగా ఉపకరిస్తుందని విశ్వసిస్తూ, భద్రాద్రి రాముని కృప అందరికీ కలగాలని వాంఛిస్తూ.....

శ్రీరామరక్ష సర్వజగద్రక్ష.

శ్రీరామ సేవలో....
**డా॥ ఉలిమిరి వేంకట సోమయాజులు**
శ్రీరామ సేవాసమితి
క్రొత్త ఢిల్లీ.

# శతపత్ర సూచిక

# దాశరథీ శతకము

- శ్రీ భక్త రామదాసుగారు

ఉ. శ్రీ రఘురామ, చారుతులసీ దళ దామ, శమక్షమాది శృం
గార గుణాభిరామ, త్రిజగన్నుత శౌర్యరమా లలామ, దు
ర్వార కబంధ రాక్షస విరామ, జగజ్జన కల్మషార్ణవో
త్తారక నామ, భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥1॥

ఉ. రామ ! విశాల విక్రమ పరాజిత భార్గవరామ ! సద్గుణ
స్తోమ ! పరాంగనా విముఖ సువ్రతకామ ! వినీల నీరద
శ్యామ ! కకుత్థ్సవంశ కలశాంబుధిసోమ ! సురారిదోర్బలో
ద్దామ విరామ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥2॥

చ. అగణిత సత్యభాష, శరణాగత పోష, దయా లసజ్ఝరీ
విగత సమస్త దోష, పృథివీసుర తోష, త్రిలోక పూతకృ
ద్గగన ధునీ మరంద పద కంజ విశేష, మణిప్రభా ధగ
ద్ధగిత విభూష, భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥3॥

ఉ. రంగ దరాతిభంగ, ఖగరాజ తురంగ, విప త్పరంపరో
త్తుంగ, తమః పతంగ, పరితోషితరంగ, దయాతరంగ, స
త్సంగ, ధరాత్మజా హృదయసారస భృంగ, నిశాచరాబ్జ మా
తంగ, శుభాంగ, భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥4॥

ఉ. శ్రీద, సనందనాదిముని సేవిత పాద, దిగంత కీర్తిసం
పాద, సమస్తభూత పరిపాల వినోద, విషాద వల్లికా
చ్ఛేద, ధరాధినాథ కుల సింధు సుధామయపాద, నృత్యగీ
తాదివినోద, భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥5॥

ఉ. శ్రీ రమణీయహార, యతసీ కుసుమాభశరీర, భక్తమం
దార, వికారదూర, పరతత్త్వవిహార, త్రిలోక చేతనో
ద్ధార, దురంత పాతకవితాన విదూర, ఖరాదిదైత్య కాం
తార కుఠార, భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥6॥

చ. దురితలతాలవిత్ర, ఖరదూషణకానన వీతిహోత్ర, భూ
భరణకళా విచిత్ర, భవబంధ విమోచనసూత్ర, చారు వి
స్ఫురదరవిందనేత్ర, ఘనపుణ్యచరిత్ర, వినీలభూరికం
ధర సమగాత్ర, భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥7॥

చ. కనక విశాల చేల, భవకానన శాతకుఠారధార, స
జ్జన పరిపాలశీల, దివిజస్తుత సద్గుణకాండ, కాండ సం
జనిత పరాక్రమ క్రమ విశారద, శారదకందకుంద చం
దనఘనసార సారయశ, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥8॥

ఉ. ఆర్యులకెల్ల మ్రొక్కి, వినతాంగుడనై, రఘునాథభట్ట రా
చార్యుల కంజలెత్తి, కవి సత్తములన్ వినుతించి, కార్య సౌ
కర్య మెలర్ప, నొక్క శతకం బొనగూర్చి రచింతునేఁడు తా
త్పర్యమునన్ గ్రహింపుమిది, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥9॥

చ. మసకొని రేఁగుబండ్లకును మౌక్తికముల్ వెలవోసినట్లు, దు
ర్వ్యసనముజెంది కావ్యము దురాత్ములకిచ్చితి మోసమయ్యె నా
రసనకుఁ బూతవృత్తి సుకరంబుగ జేకుఱునట్లు వాక్సుధా
రసములు చింద భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥10॥

ఉ. శ్రీరఘువంశ తోయధికి శీతమయూఖుడవైన నీ పవి
త్రోరు పదాబ్జముల్, వికసితోత్పల చంపక వృత్తమాధురీ
పూరిత వాక్ప్రసూనములఁ బూజ లొనర్చెద, జిత్తగింపుమీ
తారకనామ భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥11॥

చ. గురుతరమైన కావ్యరసగుంభన కబ్బురమంది ముష్కరుల్
సరసులమాడ్కి సంతసిలజాల రదెట్లు శశాంక చంద్రికాం
కురముల కిందుకాంతమణికోటి స్రవించినభంగి వింధ్యభూ
ధరమున జాఱునే శిలలు ! దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥12॥

చ. తరుణికులేశ నానుడులఁ దప్పులు గల్గిన నీదునామ స
ద్విరచితమైన కావ్యము పవిత్రముగాదె ! వియన్నదీ జలం
బరుగుచు వంకయైన, మలినాకృతిఁబాఱిన దన్మహత్వముం
దరమె గణింప నెవ్వరికి ! దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥13॥

ఉ. దారుణ పాతకాబ్ధికి సదా బడబాగ్ని, భవాకులార్తి వి
స్తార దవానలార్చికి సుధారసవృష్టి, దురంత దుర్మతా
చార భయంకరాటవికిఁ జండకఠోర కుఠారధార నీ
తారకనామ మెన్నుకొన, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥14॥

చ. హరునకు నవ్విభీషణున కద్రిజకున్ దిరుమంత్రరాజమై,
కరికి నహల్యకుం ద్రుపదకన్యకు నార్తిహరించు చుట్టమై,
పరగిన యట్టి నీ పతితపావన నామము జిహ్వపై నిరం
తరము నటింపఁజేయుఁమిక దాశరథీ ! కరుణాపయోనిధీ॥ ॥15॥

ఉ. ముప్పున గాలకింకరులు ముంగిట వచ్చిన వేళ, రోగముల్
గొప్పరమైనచో కఫము కుత్తుక నిండిన వేళ, బాంధవుల్
గప్పిన వేళ, మీ స్మరణ కల్గునొ గల్గదొ ! నాటికిప్పుడే
తప్పకచేతు మీ భజన దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥16॥

చ. పరమ దయానిధే, పతితపావననామ హరే యటంచు సు
స్థిరమతులై సదా భజనసేయు, మహాత్ముల పాదధూళి నా
శిరమునఁదాల్తు, 'మీ రటకు జేరకు' డంచు యముండు కింకరో
త్కరములకానఁబెట్టునఁట; దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥17॥

చ. అజునకుఁ దండ్రివయ్యు, సనకాదులకున్ బరతత్త్వమయ్యు,
సద్విజ మునికోటికెల్లఁ బరదేవతవయ్యు, దినేశ వంశభూ
భుజులకు మేటివయ్యు, బరిపూర్ణుడవై వెలుగొందు పక్షిరా
డ్ధ్వజ మిముఁ బ్రస్తుతించెదను, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥18॥

ఉ. పండిత రక్షకుండఖిల పాప విమోచనుఁ డబ్జసంభవా
ఖండలపూజితుండు, దశకంఠవిలుంఠన చండకాండ కో
దండ కళా ప్రవీణుడను, తావక కీర్తి వధూటికిత్తుఁబూ
దండలుగాఁగ నా కవిత, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 19 ॥

ఉ. శ్రీరమసీతగాఁగ, నిజ సేవకబృందము వీరవైష్ణవా
చారజనంబుగాఁగ, విరజానది గౌతమిగా, వికుంఠ ము
న్నారయ భద్రశైల శిఖరాగ్రముగాఁగ, వసించు చేతనో
ద్ధారకుడైన విష్ణుఁడవు, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 20 ॥

ఉ. కంటి నదీతటంబుఁ, బొడగంటిని భద్రనగాధివాసమున్,
గంటి నిలాతనూజ, నురు గార్ముకమార్గణ శంఖచక్రముల్
గంటిని, మిమ్ము లక్ష్మణునిఁ గంటి, కృతార్థుఁడనైతి నో జగ
త్కంటక దైత్యనిర్దళన, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 21 ॥

చ. హలికునకున్ హలాగ్రమున నర్థము సేకురుభంగి, దప్పిచే
నలమటఁజెందువానికి సురాపగలో జలమబ్బినట్లు, దు
ర్మలిన మనోవికారియగు, మర్త్యుని నన్నొడఁ గూర్చి, నీపయిం
దలపు ఘటింప జేసితివి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 22 ॥

ఉ. కొంజక, తర్కవాదమను గుద్దలిచే పరతత్త్వ భూస్థలిన్,
రంజిల ద్రవ్వి కన్గొనని రామనిధానము, నేడు భక్తి సి
ద్ధాంజనమందు హస్తగతమయ్యె, భళీయనగా మదీయహృ
త్కంజమునన్ వసింపుమిక, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 23 ॥

ఉ. రాముఁడు, ఘోరపాతక విరాముడు, సద్గుణకల్పవల్లి కా
రాముఁడు, షడ్వికారజయ రాముఁడు, సాధుజనావనవ్రతో
ద్దాముఁడు, రాముడే పరమదైవము మాకని, మీయడుంగు గెం
దామరలే భజించెదను, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 24 ॥

ఉ. చక్కెరమాని వేముఁదినజాలిన కైవడి, మానవాధముల్
పెక్కురు బక్కదైవముల వేమరుగొల్చెద రట్లు కాదయా,
మ్రొక్కిన నీకె మ్రొక్కవలె, మోక్షమొసంగిన నీవయీవలెం
దక్కినమాటలేమిటికి ! దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 25 ॥

ఉ. 'రా' కలుషంబులెల్ల బయలంబడద్రోచిన, 'మా'కవాటమై
ఢీకొనిప్రోచు నిక్కమని ధీయుతులెన్నఁ దదీయవర్ణముల్
గైకొని భక్తిచే నుడువఁ గానరుగాక విపత్పరంపరల్
దాకొనునే జగజ్జనుల, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 26 ॥

ఉ. రామహరే కకుత్స్థకుల రామహరే, రఘు రామరామశ్రీ
రామహరే యటంచు, మదిరంజిల భేకగళంబులీల నీ
నామము సంస్మరించిన జనంబు భవంబెడబాసి తత్పరం
ధామ నివాసులౌదురఁట దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥27॥

ఉ. చక్కెరలప్పకున్, మిగుల జవ్వని కెంజికురాకుమోవికిం,
జొక్కపుజుంటి తేనియఁకు జొక్కిలుచుం గనలేరుగాక, నే
డక్కట రామనామ మధురామృత మానుటకంటె సౌఖ్యమా
తక్కిన మాధురీమహిమ దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 28 ॥

ఉ. అండజవాహ నిన్ను హృదయంబున నమ్మినవారి పాపముల్
కొండలవంటివైన వెసఁగూలి నశింపక యున్నె, సంతతా
ఖండలవైభవోన్నతులు గల్గకమానునె, మోక్షలక్ష్మికై
దండయొసంగకున్నె తుద ! దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 29 ॥

ఉ. చిక్కని పాలపై మిసిమిఁచెందిన మీఁగడ పంచదారతో
మెక్కినభంగి, నీ విమలమేచకరూప సుధారసంబు నా
మక్కువ పళ్ళెరంబున సమాహితదాస్య మనేటి దోయిటన్
దక్కెనటంచు జుఱ్ఱెదను, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 30 ॥

చ. సిరులిడ సీత, పీడలెగఁజిమ్ముటకున్ హనుమంతు, డాఁర్తి సో
దరుఁడు సుమిత్రసూతి, దురితంబులు మానుప రామనామమున్
కరుణ దలిర్ప మానవుల గావగ పన్నిన వజ్రపంజరో
త్కరముగదా భవన్మహిమ దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 31 ॥

చ. హలకులిశాంకుశధ్వజ శరాసనశంఖరథాంగ కల్పకో
జ్వల జలజాతరేఖలును, సాంకములై కనుపట్టుచున్న మీ
కలిత పదాంబుజద్వయము, గౌతమపత్ని కొసంగినట్లు నా
తలఁపునఁ జేర్చి కావగదె దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 32 ॥

చ. జలనిధిలోన దూఱి, కులశైలముమీటి, ధరిత్రిగొమ్మునన్
దలవడ మీటి, రక్కసుని యంశము గీటి, బలీంద్రునిన్ రసా
తలమున మాటి, పార్థివకదంబము గూల్చిన మేటిరామ ! నా
తలఁపుననాటి రాఁగదవె ! దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 33 ॥

చ. భండన భీముఁడార్తజన బాంధవుఁ డుజ్జ్వల బాణతూణకో
దండకళా ప్రచండ భుజ తాండవకీర్తికి రామమూర్తికిన్
రెండవసాటి దైవమికఁ లేఁడనుచున్ గడకట్టి భేరికా
ఢాండడఢాండ ఢాండ నినదంబు లజాండమునిండ మత్తవే
దండము నెక్కి చాటెదను దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥34॥

చ. అవనిజ కన్నుదోయితొగలందు వెలింగెడు సోమ, జానకీ
కువలయనేత్రి గబ్బి చనుగొండలనుండు ఘనంబ, మైథిలీ
నవనవయౌవనంబను వనంబునకున్ మదదంతి వీవెకా
దవిలి భజింతు నెల్లపుడు దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 35 ॥

చ. ఖరకర వంశజా ! నిను మఖండిత భూత పిశాచ ఢాకినీ
జ్వరపరితాప సర్పభయ వారకమైన భవ త్పదాబ్జ వి
స్ఫురదురు వజ్రపంజరము జొచ్చితి నీయెడ దీనమానవో
ద్ధర బిరుదాంక యేమఱకు దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 36 ॥

చ. జుఱ్ఱెద మీ కథామృతము జుఱ్ఱెద మీపద కంజతోయమున్
జుఱ్ఱెద రామనామమున జొబ్బిలుచున్న సుధారసంబు నే
జుఱ్ఱెద జుఱ్ఱుజుఱ్ఱుగ రుచుల్ గనువారి పదంబుగూర్పవే
తఱ్ఱులతోడి పొత్తిడక దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 37 ॥

ఉ. ఘోరకృతాంత వీరభట కోటికి గుండెదిగుల్, దరిద్రతా
కార పిశాచ సంహరణ కార్యవినోది, వికుంతమందిర
ద్వారకవాటభేది, నిజ దాస జనావళి కెల్ల ప్రొద్దు నీ
తారకనామ మెన్నుకొన దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 38 ॥

ఉ. విన్నపమాలకించు రఘువీర ! నహి ప్రతిలోకమందునా
కన్న దురాత్ముఁడున్, బరమ కారుణికోత్తమ ! వేల్పులందు నీ
కన్న మహాత్ముఁడున్, బతిత కల్మష దూరుఁడు లేఁడునాగ, వి
ద్వన్నుత నీవె నాకుగతి, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 39 ॥

ఉ. పెంపునఁదల్లివై, కలుషబృందసమాగమ మొందకుండ ర
క్షింపను తండ్రివై మెయివసించు దశేంద్రియరోగముల్ నివా
రింపను వెజ్జువై కృపగురించి పరంబు దిరంబుగాఁగ స
త్సంపదలియ్య నీవెగతి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 40 ॥

ఉ. కుక్షి నజాండ పంక్తులొనఁగూర్చి, చరాచర జంతుకోటిసం
రక్షణసేయు తండ్రివి, పరంపర నీ తనయుండనైన నా
పక్షము నీవు గావలదె, పాపములెన్ని యొనర్చినన్ జగ
ద్రక్షక కర్త నీవెకద దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥41॥

ఉ. గద్దరి యోగి హృత్కమల గంధరసానుభవంబుఁ జెందు పె
న్నిద్దపు గండుఁదేటి, ధరణీసుత కౌఁగిలి పంజరంబునన్
ముద్దులుగుల్కు రాచిలుక, ముక్తి నిధానమ, రామ రాఁగదే
దద్దయు నేఁడు నాకడకు, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 42 ॥

చ. కలియుగమర్త్యకోటి నినుఁ గన్గొనరాని విధంబొ, భక్తవ
త్సలత వహించవో, చటుల సాంద్రవిపద్దశవార్ధి గ్రుంకుచో
బిలిచిన బల్కవింత మఱపే నరులి ట్లనరాదుగాక నీ
తలపున లేదె సీతచెఱ, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 43 ॥

చ. జనవర మీకథాళి వినసైపక కర్ణములందు ఘంటికా
నినద వినోదముల్ సలుపు నీచునకున్ వరమిచ్చినావు, ని
న్ననయము నమ్మికొల్చిన మహాత్ములకేమి యొసంగెదో సనం
దన నుత మా కొసంగుమయ, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 44 ॥

ఉ. పాపములొందువేళ, రణ పన్నగ భూత భయజ్వరాదులం
దాపదనొందువేళ, భరతాగ్రజ ! మిమ్ము భజించువారికిన్
బ్రాపుగ నీవుఁ దమ్ముడిరుపక్కియలన్ జని, తద్విపత్తిసం
తాపము మాన్పి కాతురట దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 45 ॥

చ. అగణిత జన్మకర్మదురితాంబుధిలో బహుదుఃఖవీచికల్
తెగిపడ నీదలేక జగతీధవ ! నీ పదభక్తి నావ చేఁ
దగిలి తరింపగోరితిఁ బదంపడి నాదు భయంబు మాన్పవే
తగదని చిత్తమం దిడక, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 46 ॥

ఉ. నేనొనరించు పాపము లనేకములైనను నాదు జిహ్వకుం
బానకమయ్యె మీ పరమపావన నామము, దొంటి చిల్క 'రా
మా ! ననుగావు'మన్న, తుది మాటకు సద్గతిఁ జెందెగావునన్
దాని ధరింపఁ గోరెదను, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 47 ॥

చ. పరధనముల్ హరించి, పరభామలనంటి, పరాన్నమబ్బినన్
మురిపమ కాని, మీదనగు మోసమెఱుంగదు మానసంబు, దు
స్తరమిది, కాలకింకర గదాహతి పాల్పడనీక మమ్మునే
తరి దరిజేర్చి కాచెదవొ దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥48॥

ఉ. చేసితి ఘోరకృత్యములు, చేసితి భాగవతాపచారముల్,
చేసితి నన్యదైవములఁ జేరి భజించినవారిపొందు, నేఁ
జేసిన నేరముల్ దలచి చిక్కులబెట్టకుమయ్య, యయ్య, నీ
దాసుఁడనయ్య, భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 49 ॥

చ. పరుల ధనంబుఁజూచి, పరభామలఁజూచి హరింపగోరు మ
ద్గురుతర మానసం బనెడు దొంగను బట్టి, నిగూఢ దాస్యవి
స్ఫురిత వివేకపాశముల జుట్టి, భవచ్చరణంబ నే మరు
త్తరువునఁ గట్టివేయఁగదెఁ, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 50 ॥

చ. సలలిత రామనామ జపసార మెఱుంగను, గాశికాపురీ
నిలయుఁడగాను, మీచరణ నీరజరేణు మహా ప్రభావమున్
దెలియ నహల్యగాను, జగతీవర ! నీదగు సత్యవాక్యముల్
దలఁపగ రావణాసురుని తమ్ముఁడగాను, భవద్విలాసముల్
తలఁచి నుతింప నాతరమె దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 51 ॥

ఉ. పాతకులైన మీ కృపకు బ్రాతులుకారె తలంచిచూడఁ జ
ట్రాతికిఁగల్గె భావన, మరాతికి రాజ్యసుఖంబు గల్గె, దు
ర్జాతికిఁ బుణ్యమబ్బె, గపిజాతి మహత్త్వమునొందెఁగావునన్
దాతవు యెట్టి వారలకు దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 52 ॥

ఉ. మామక పాతక వ్రజము మాన్ప నగణ్యము చిత్రగుప్తుడే
మేమని వ్రాయునో ? శమను డేమివిధించునొ ? కాలకింకర
స్తోమ మొనర్చుటేమొ ? వినఁ జొప్పడదింతకుమున్నె దీనచిం
తామణి ! యెట్లు గాచెదవొ, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 53 ॥

ఉ. డాసిన చుట్టమా శబరి ? దాని దయామతి నేలినావు, నీ
దాసునిదాసుడా గుహుఁడు ? తావకదాస్య మొసంగినావు, నే
చేసిన పాపమా వినుతి చేసిన గావవు, గావుమయ్య నీ
దాసులలోన నే నొకఁడ దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 54 ॥

ఉ. దీక్షవహించి నా కొలదిఁ దీనులనెందఱిఁ గాచితో, జగ
ద్రక్షక ! తొల్లి యా ద్రుపదరాజతనూజ తలంచినంతనే,
యక్షయమైనవల్వలిడి, తక్కట నామొఱఁ జిత్తగించి ప్ర
త్యక్షము గావదేమిటికి ! దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 55 ॥

ఉ. నీలఘనాభమూర్తివగు, నిన్నుఁ గనుంగొనగోరి వేడినన్
జాలము సేసి దాగెదవు. సంస్తుతి కెక్కిన రామనామ మే
మూలను దాచుకోగలవు ? ముక్తికిఁ బ్రాపది, పాపమూలకు
ద్దాలముగాదె మాయెడల, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 56 ॥

ఉ. వలదు పరాకు, భక్తజనవత్సల ! నీ చరితంబు వమ్ముగా
వలదు, పరాకు నీ బిరుదు వజ్రమువంటిది కావ కూరకే
వలదు, పరాకు, నా దురిత వార్ధికిఁ దెప్పవుగా, మనంబులోఁ
దలుతుమెకా నిరంతరము దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 57 ॥

ఉ. తప్పు లెఱుంగలేక దురితంబులు సేసితినంటి, నీవు మా
యప్పవు గావుమంటి, నిక నన్యులకున్ నుదురంటనంటి, నీ
కొప్పిదమైన దాసజనులొప్పిన బంటుకు బంటునంటి, నా
తప్పులకెల్ల నీవె గతి, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 58 ॥

చ. ఇతఁడు దురాత్ముఁడంచు జనులెన్నగ నాఱడి గొంటినేనెపో
పతితుఁడనంటివో, పతితపావనమూర్తివి నీవు గల్గ నే
నితరుల వేఁడనంటి నిహ మిచ్చిననిమ్ము, పరంబొసంగుమీ
యతులితరామనామ మధు రాక్షరపాళి నిరంతరంబు హృ
ద్గతమని నమ్మికొల్చెదను, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 59 ॥

ఉ. అంచితమైన నీదు కరుణామృతసారము నాదుపైని బ్రో
క్షించినఁజాలు దాన నిరసించెద నా దురితంబులెల్లఁ దూ
లించెద వైరివర్గమెడలించెదఁగోర్కెల నీదు బంటునై
దంచెదఁ గాలకింకరుల దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 60 ॥

చ. జలనిధులేడె నొక్కమొగిఁ జక్కికిఁదెచ్చె కరంబు ఱాతి నిం
పలరఁగజేసె నాతిగఁ బదాబ్జపరాగము నీ చరిత్రమున్
జలజభవాది నిర్జరులు, సన్నుతిసేయగలేరు గావునన్
దలప నగణ్యమయ్య మది, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥61॥

ఉ. కోతికి శక్యమా యసురకోటులగెల్వను గెల్చెఁబో నిజం
బాతని మేన శీతకరుఁడౌట దవానలుఁ డెట్టివింత ? మా
సీత పతివ్రతామహిమ, సేవకు భాగ్యము, మీ కటాక్షమున్
ధాతకు శక్యమా పొగడ, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 62 ॥

ఉ. భూపలలామ రామ, రఘుపుంగవరామ, త్రిలోకరాజ్య సం
స్థాపనకామ, మోక్షఫలదాయక రామ, మదీయ పాపముల్
బాపఁగదయ్య రామ, నిను బ్రస్తుతిచేసెదనయ్య రామ సీ
తాపతి రామ, భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 63 ॥

ఉ. నీ సహజంబు సాత్త్వికము నీ విడిపట్టు సుధాపయోధి, ప
ద్మాసనుఁడాత్మజుండు, గమలాలయ నీ ప్రియురాలు, నీదు సిం
హాసనమిద్ధరిత్రి, గొడుగాకస మక్షులు చంద్ర భాస్కరుల్,
నీసుమతల్పమాది ఫణి, నీవె సమస్తము గొల్చినట్టి నీ
దాసుల భాగ్యమెట్టిదయ దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 64 ॥

చ. చరణము సోఁకినట్టి శిలజవ్వనియయ్యె నదొక్కవింత, సు
స్థిరముగ నీటిపై గిరులు దేలిన దొక్కటి వింతగాని, మీ
స్మరణఁ దనర్చు మానవులు సద్గతిచెందిన దెంతవింత ? యీ
ధరను ధరాత్మజారమణ దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 65 ॥

ఉ. దైవము తల్లిదండ్రి తగుదాత గురుండు సఖుండు నిన్నెగా
భావనసేయుచున్న తఱి, పాపములెల్ల మనోవికార దు
ర్భావితుఁజేయుచున్నవి కృపామతివై ననుగావుమీ జగ
త్పావనమూర్తి భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 66 ॥

ఉ. వాసవ రాజ్యభోగసుఖవార్ధినిదేలు ప్రభుత్వ మబ్బిన
న్నాసకు మేరలేదు, కనకాద్రిసమానధనంబుఁ గూర్చినన్
గాసును వెంటరాదు, కని కానక చేసిన పుణ్యపాపముల్
వీసరబోవు, నీవు, పదివేలకుజాలు భవంబు నొల్ల, నీ,
దాసునిగాఁగ, నేలుకొను దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 67 ॥

ఉ. సూరిజనుల్, దయాపరులు, నూనృతవాదులలుబ్ధమానవుల్,
వీర పతివ్రతాంగనలు, విప్రులు, గోవులు, వేదముల్ మహీ
భారముఁ దాల్పగా, జనులు, పావనమైన పరోపకార స
త్కార మెఱుంగలే రకట ! దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 68 ॥

ఉ. వారిచరావతారమున, వారిధిలో జొరబాఱి క్రోధ వి
స్తారగుడైన యా నిగమ తస్కరవీర నిశాచరేంద్రునిం
జేరి వధించి వేదముల చిక్కెడలించి విరించికిన్ మహో
దారత నిచ్చి తీవెగద, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 69 ॥

చ. కర మనురక్తి మందరము గవ్వముగా యహిరాజు ద్రాడుగా
దొరకొని దేవదానవులు, దుగ్ధపయోధి మథించుచున్నచో
ధరణి చలింప లోకములు తల్లడమందఁగఁ గూర్మమై ధరా
ధరము ధరించి తీవెగద, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 70 ॥

ఉ. ధారుణి చాపఁజుట్టిన విధంబునగైకొని హేమనేత్రు, డ
వ్వారిధిలోన దాఁగినను, వాని వధించి వరాహమూర్తివై
ధారుణి దొంటి కైవడిని దక్షిణ శృంగమునన్ ధరించి వి
స్తార మొనర్చి తీవెకదా, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 71 ॥

చ. పెటపెట నుక్కుకంబమున భీకర దంత నఖాంకుర ప్రభా
పటలము గప్ప నుప్పతిలి, భండనవీథి నృసింహ భీకర
స్ఫుట పటుశక్తి హేమకశిపున్ విదళించి సురారిపట్టి నం
తటఁ గృపఁజూచితీవెకద, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 72 ॥

చ. పదయుగళంబు భూగగనభాగములన్ వెసనూని విక్రమా
స్పదమగు నబ్బలీంద్రు నొకపాదమునన్ దలక్రిందనొత్తి మే
లొదవ జగత్త్రయంబు బురుహూతనకియ్య వటుండవైన చి
త్పదమలమూర్తివీవెకద, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 73 ॥

చ. ఇరువదియొక్కమారు ధరణీశులనెల్ల వధించి, తత్కళే
బర రుధిర ప్రవాహమున బైతృకదర్పణమొప్పజేసి, భూ
సురవరకోటికిన్ ముదముసొప్పడ భార్గవరామమూర్తివై
ధరణి నొసంగి తీవెకద, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 74 ॥

చ. దురమున దాటకం దునిమి, ధూర్జటివిల్ దునుమాడి సీతనున్
బరిణయమంది తండ్రిపనుపన్ ఘనకాననభూమికేగి దు
స్తరపటుచండకాండకులిశాహతి రావణ కుంభకర్ణ భూ
ధరములఁ గూల్చితీవెకద, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 75 ॥

చ. అనుపమ యాదవాన్వయ సుధాబ్ధి సుధానిధి కృష్ణమూర్తి నీ
కనుజుడుగా జనించి కుజనావళినెల్ల నడంచి రోహిణీ
తనయు డనంగ బాహుబలదర్పమునన్ బలరామమూర్తివై
తనరిన వేల్పు వీవెకద, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 76 ॥

చ. సురలు నుతింపగాఁ ద్రిపుర సుందరులన్ వరియింప బుద్ధరూ
పరయగఁ దాల్చితీవు త్రిపురాసురకోటి దహించునప్పుడా
హరునకు దోడుగా వరశరాసన, బాణముఖోగ్ర సాధనో
త్కర మొనరించి తీవుకద, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 77 ॥

ఉ. సంకరదుర్గమై దురితసంకులమైన జగంబుజూచి స
ర్వంకషలీల నుత్తమ తురంగమునెక్కి కరాసిఁబూని వీ
రాంక విలాస మొప్పఁ గలికాకృతి సజ్జనకోటికిన్ నిరా
తంక మొనర్చె దీవెకద, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 78 ॥

చ. మనమున నూహపోహలును మర్వక మున్నె కఫాదిరోగముల్
దనువున నంటి మేనిబిగి దప్పక మున్నె, నరుండు మోక్ష సా
ధన మొనరింపగావలయు, తత్త్వవిచారముమాని యుండుట
ల్తనువునకున్ విరోధమిది, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 79 ॥

చ. ముదమునకాటపట్టు, భవ మోహ మదద్విరదాంకుశంబు సం
పదల కొటారు కోరికల పంట, పరంబున కాది, వైరుల
న్నదల జయించుత్రోవ, విపదబ్ధికి నావగదా, సదా భవ
త్సదమల నామసంస్మరణ, దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 80 ॥

చ. దురితలతానుసారి భవదుఃఖకదంబము రామనామ భీ
కరతర హేతిచే దెగి వికావికలై చనకుండ నేర్చు నే
దరికొని మండుచుండు శిఖి దార్కొనినన్ శలభాదికీటకో
త్కరము విలీనమై చనదె దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 81 ॥

ఉ. హరిపదభక్తి నింద్రియ జయాన్వితుఁడుత్తముఁడింద్రియంబులన్
మరుగక నిల్పి నూఁదినను మధ్యముఁ డింద్రియపారవశ్యుడై
పరగినచో నికృష్టుడని పల్కగ దుర్మతినైన నన్ను నా
దరమునెట్లు కాచెదవొ దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 82 ॥

చ. వనకరి చిక్కెమైనసకుఁ వాచవికిం జెడిపోయె మీను, తా
వినికికిఁజిక్కెఁజిల్వ గను వేదుఱుజెందెను లేళ్ళు, తావిలో
మనికి నశించె దేటి తరమా యిరుమూటిని గెల్వ, నైదుసా
ధనముల నీవె కావఁదగు దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 83 ॥

చ. కరములు మీకు మ్రొక్కులిడ గన్నులు మిమ్మునెచూడ జిహ్వమీ
స్మరణనొనర్ప వీనులు భవత్కథలన్ వినుచుండ నాసమీ
యఱుతనుబెట్టు పూసరుల కాసగొనం బరమార్థ సాధనో
త్కరమిది చేయవే కృపను దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 84 ॥

చ. చిరతరభక్తి నొక్కతులసీదళ మర్పణ సేయువాఁడు ఖే
చర గరుడోరగ ప్రముఖ సంఘములో వెలుగన్ సదాభవత్
స్ఫురదరవిందపాదముల బూజ లొనర్చినవారికెల్ల ద
త్పర మరచేత ధాత్రికద దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 85 ॥

ఉ. భానుఁడు తూర్పునందు గనుపట్టిన పావకచంద్రతేజముల్
హీనతఁజెందినట్లు జగదేక విరాజితమైన నీపద
ధ్యానము సేయుచున్న బరదైవమరీచులడంగకుండునే
దానవగర్వ నిర్దళన దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 86 ॥

ఉ. నీ మహనీయ తత్త్వరస నిర్ణయబోధ కథామృతాబ్ధిలో
దా మునుగ్రుంకులాడక వృథా తను కష్టముచెంది మానవుం
డీ మహిలోని తీర్థముల నెల్ల మునింగిన దుర్వికార హృ
త్తామస పంకముల్ విడునె దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 87 ॥

ఉ. కాంచనవస్తుసంకలిత కల్మష మగ్నిపుటంబు వెట్టి వా
రించినరీతి నాత్మ నిగిడించిన దుష్కర దుర్మలత్రయం
బంచిత భక్తియోగ దహనార్చిఁదగుల్పకపాయునే కన
త్కాంచన కుండలాభరణ దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 88 ॥

ఉ. నీసతి పెక్కుగల్ములిడ నేర్పరి, లోక మకల్మషంబుగా
నీ సుతసేయుఁ బావనము, నిర్మిత కార్యధురీణదక్షుడై
నీసుతుఁడిచ్చు నాయువును, నిన్ను భజించిన గల్గకుండునే
దాసుల కీప్సితార్థములు దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 89 ॥

ఉ. వారిజపత్రమందిడిన వారి విధంబున వర్తనీయమం
దారయరొంపిలోన దను వంటని కుమ్మరిపుర్వురీతి సం
సారమునన్ మెలంగుచు విచారకుడై పరమొందుగాదె స
త్కార మెఱింగి మానవుడు దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 90 ॥

ఉ. దొరసిన కాయముల్ముదిమితోచినఁజూచి ప్రభుత్వ ముల్సిరు
ల్మెఱుపులుగాఁగ జూచి మఱి మేదినిలో తమతోడివారు ముం
దరుగుట చూచి చూచి తెగునాయువెఱుంగక మోహపాశము
ల్దరుగనివారి కేమిగతి ? దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 91 ॥

ఉ. సిరి గలనాఁడు మైమఱచి చిక్కిననాడు దలంచి, పుణ్యముల్
పొరిఁబొరి సేయనైతినని పొక్కిన గల్గునె గాలిచిచ్చుపై
గెరలినవేళఁ దప్పిగొని కీడ్పడువేళ జలంబు గోరి త
త్తరమునఁ ద్రవ్వినన్ గలదె దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 92 ॥

ఉ. జీవనమింక బంకమున జిక్కినమీను చలింప కెంతయున్
దావుననిల్చి జీవనమె తద్దయు గోరువిధంబు చొప్పడం
దావలమైనదాని గుఱితప్పనివాఁడు చరించువాఁడయా
తావక భక్తియోగమున దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 93 ॥

చ. సరసుని మానసంబు సరసజ్ఞుఁడెఱుంగును ముష్కరాధముం
డెఱిఁగి గ్రహించువాఁడె ! కొల నేకనివాసము దుర్ధరం
బరయగ నేర్చునట్లు వికచాబ్జమరంద రసైక సౌరభో
త్కరము మిళిందమొందుక్రియ దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 94 ॥

ఉ. నోచిన తల్లి దండ్రికి దనూభవుఁడొక్కడె చాలు, మేటి చే
చాచనివాడు, వేఱొకఁడు చాచినలేదన కిచ్చువాఁడు నోఁ
రాచి నిజంబగాని పలుకాడనివాఁడు రణంబులోన మేన్
దాచనివాఁడు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 95 ॥

ఉ. శ్రీయుత జానకీరమణ, చిన్మయరూప రమేశ రామ నా
రాయణ పాహిపాహియని, ప్రస్తుతిజేసితి నా మనంబునన్,
బాయక కిల్బిషవ్రజ నిపాటన మందగఁజేసి సత్కళా
దాయి ఫలంబు నాకియవె దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 96 ॥

ఉ. ఎంతటి పుణ్యమో శబరి యెంగిలి గొంటివి వింతగాదె, నీ
మంతన మెట్టిదో యుడుత మైని కరాగ్ర నఖాంకురంబులన్
సంతసమందజేసితివి, సత్కుల జన్మములేమి లెక్క వే
దాంతముగాదె నీ మహిమ దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 97 ॥

ఉ. బొంకనిఁ వాడెయోగ్యుఁ, డరిబృందము లెత్తినచోట జివ్వకున్
జంకని వాఁడెజోదు, రభసంబుననర్థి కరంబు సాచినన్
గొంకనివాఁడె దాత, మిముగొల్చి భజించిన వాఁడెపో నిరా
తంక మనస్కుఁ డెన్నగను దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 98 ॥

చ. భ్రమరము కీటకంబు గొనిపొల్పడి, ఝుంకరణోపకారియై
భ్రమరముగా నొనర్చునని పల్కుటజేసి, భవాదిదుఃఖసం
తమసమెడల్చి భక్తిసహితంబుగ జీవుని విశ్వరూప త
త్త్వమున ధరించు టేమరుదు దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 99 ॥

చ. తరువులు పూఁచికాయలగు, తత్కుసుమంబులు పూజగా భవ
చ్చరణము సోకి దాసులకు సారములై ధన ధాన్యరాసులై
కరి భట ఘోట కాంబర నికాయములై విరజానదీ సము
త్తరణ మొనర్చు జిత్రమిది దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 100 ॥

ఉ. పట్టితి భట్టరార్య గురుపాదము లిమ్మెయి నూర్ధ్వపుండ్రముల్
పెట్టితి మంత్రరాజ మొడిబెట్టితి నయ్యమకింకరాళికిన్
గట్టితి బొమ్మ మీ చరణకంజమునందు దలంపుపెట్టి బో
దట్టితి పాపపుంజముల దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥ 101 ॥

ఉ. అల్లన లింగమంత్రి సుతు డత్రిజగోత్రుజుఁడాదిశాఖ కం
చెర్ల కులోద్భవుండన బ్రసిద్ధుఁడనై భవ దంకితమ్ముగా
నెల్లకవుల్ నుతింప వచియించితి గోపకవీంద్రుఁడన్ జగ
ద్వల్లభ నీకు దాసుఁడను దాశరథీ ! కరుణాపయోనిధీ ॥ ॥102॥



# సంకలిత పద్య శతకము

- శ్రీ రాజా తూము లక్ష్మీనృసింహదాసుగారు

## శ్రీ విష్ణుస్తుతి

ఉ. శ్రీ రమణీ కుచద్వితయ సిక్తపటీర సుగంధబంధురో
దార శరణ్యుఁడయ్యు నిరతంబు నురంబున దద్రమాంగనన్
గూరిచి సంతసిల్లి పులుఁగున్నెర పక్కెరనెక్కియాడు శ్రీ
శౌరి భజింతుఁదచ్చరణసారస యుగ్మమునాశ్రయించుచున్ ॥ ॥1॥

చ. ఘనుఁడగు రామచంద్రు పదకంజములే మదినిల్పివేడుకన్
జనకజఁబూజ చేసి మదిఁ జారుతరంబుగ నాంజనేయునిన్
వినయముచే నుతించి పరవీరభయంకరుడైన లక్ష్మణున్
బ్రణతి యొనర్చి యెల్లపుడుఁ బ్రార్థన చేసెద నిష్టసిద్ధికిన్ ॥ ॥2॥

ఉ. నమ్మిన నిన్నె నమ్మవలె నౌనది యట్లువిరోధితమ్మునిన్
నమ్మిన రాజుఁజేసితి వనాథలపాలిటి దైవరాయ నే
నమ్మ మఱెవ్వరిన్ మిగులనమ్మితి నిర్మలకర్మ చిత్త వా
క్యమ్ముల నిన్ను నిమ్మతి నఖండ కృపానిధి జానకీపతీ ॥ ॥3॥

మ. ఘన వైకుంఠమునందు రత్నమయ ప్రాకారాంత మందొప్పు చం
దన వృక్షాంతికమందు భవ్యమగు నందాఖ్యావన ప్రాంతరం
బున రమ్యాంతిక రత్నవేదికపయి న్బొపొన్పున న్శేషశ
య్యను లక్ష్మీయుతుఁడైనతారకుని రామాధీశు సేవించెదన్ ॥ ॥4॥

శా. సాకేతాంతర రత్నమంటప విరాజత్సింహ పీఠంబునం
దేకాష్టచ్ఛద పద్మకర్ణికను దానింపొంది శాఖామృగా
నీకంబు న్నిజ సోదరుల్గొలువఁబాణి న్బోధముద్రాంకుఁడౌ
కాకుత్స్థున్ రఘురాము ఁదారకు మదిన్గాంక్షించి సేవించెదన్ ॥ ॥5॥

ఉ. రాముఁడు ప్రోచు, సంతతము రామునుతింతును, రాముచేత మ
త్కామితమున్ ఫలించు, నిరతంబును రామున కేను మ్రొక్కెదన్
రామునకెక్కుడెవ్వఁడిక రాముని పాదము నెంతు రాముపైఁ
బ్రేమ చెలంగు మద్హృదయవీధి వసించెడు రాము వేఁడెదన్ ॥ ॥6॥

ఉ. రాముఁడభీష్ట దైవతము రాముని భావనచేయుచుందు శ్రీ
రాముని చేత మద్దురిత రాసులడంగును రామచంద్రు నేఁ
బ్రేమ నమస్కరింతు రఘువీరునికంటె బరంబులేదు శ్రీ
రామునకేను దాసుడను రాముని యందలి భక్తి నా కగున్ ॥ ॥7॥

చ. కమలభవ ప్రదత్త వరగర్వితపూర్వసుపర్వ నాయకో
త్తముని వధించి, ముఖ్యులగుతార విభీషణనీలజాంబవ
త్కుముద మరుత్సుతా, ర్కజులు కొల్వదిగీశులు సోదరుల్ప్రమో
దమున భజింపనింపలరు ధర్మగుణోన్నతు రాము నెన్నెదన్ ॥ ॥8॥

ఉ. రాముఁడె తండ్రి మజ్జనని రాముఁడె భ్రాతయు రామచంద్రుడే
రాముఁడె మిత్రుడు స్గురువు రాముఁడే సర్వధనంబు రాముఁడే
రాముఁడె సత్కృపాకరుఁడు రామునితో సరి యన్యదైవము
న్వేమరు లేదు లే దనుచు వేడ్క భజించెద నిష్ట సిద్ధికిన్ ॥ ॥9॥

చ. కరముల శంఖ చక్రములు గంధరమందునఁ దారహారముల్
పరగ లలాట భాగమున భవ్యసునామముఁ దేజరిల్లు వి
స్ఫురిత చిదాత్మ రూపకుని భూరి భుజంగమ తల్పక స్థితున్
ధరణితనూభవా సహితు దాశరథిన్ స్మరణంబు వేడెదన్ ॥ ॥10॥

ఉ. తారకనామ మంత్రరుచి దక్షసుతారమణుం డెఱుంగు నీ
పావన పాద పంకజ ప్రభావ మహల్య యెఱుంగు నెంతయో
దేవర దోర్బలంబు శివదేవుని చాప మెఱుంగు నీదు మే
ధావి భవంబుగల్గు శరధాటి సముద్రు డెఱుంగు రాఘవా ॥ ॥11॥

చ. ఇరుగడలందు లక్ష్మణ మహీసుతలున్ జెలువొందఁదూణమున్
శరము శరాసనంబు వరుసం జరమాంగకరంబులందు వి
స్ఫురత దనర్ప భక్తజన పుంజయశోధరుడైన రామభూ
వరుఁడు జగద్గురుండు భగవంతుఁడు నిత్యము నన్నుఁ బ్రోచుతన్ ॥॥12॥

మ. శరచాపాబ్జరథాంగము ల్కరచతుష్క ప్రాప్తమైయుండ సు
స్థిర వామాంకమునందు సీత నియతిన్ సేవింప భద్రాద్రిపై
నెరవై నట్టి సరోజనేత్రుఁ బరు యోగేంద్రేంద్ర సంస్తుత్య భా
సుర కేయూర విభూషణుం దలఁచెద న్మద్ధాంతరంగంబునన్ ॥ ॥13॥

ఆ. అనుచు నేకతంబ యాలోచనము చేసి యర్ధరాత్రి వేళ ననువుగాఁగ
స్వప్నమందు వచ్చి చాటిన మీపల్కు లొప్పుగాఁగఁ జేయు టెప్పుడొక్కొ ॥
॥14॥

మ. కమనీయావనిజాత పావన మనఃకాసారహంసున్ హిత
క్షము, దైత్యాంతకు శాంతరూపుని బృహత్సంసార సంతాప ఘో
ర మహాంభోనిధితారణున్ రఘువరున్ రాజీవపత్రేక్షణున్
విమలున్ దారకబ్రహ్మమున్ దలచి సేవింతున్ గృపా కాంక్షినై ॥ ॥15॥

మ. శ్రితపాపాటవివహ్ని లక్ష్మణధరిత్రీ పుత్రికాయుక్తు సం
చిత చంద్రానను శాంతు దేవముని సంసేవ్యున్ వినీలాకృతిన్
స్మితవక్త్రున్ రవికోటి సన్నిభమణీ సింహాసనస్థానసం
స్థితు శ్రీరాము దినాంతమందు మది నేఁ జింతింతు నిష్టాప్తికిన్ ॥ ॥16॥

గీ॥ భద్రగిరిధామ నీకు నే బంటన నెడి
ముద్ర దయచేయు మోరామ ముద మెలర్ప
నిద్ధరను గల్లునట్టి యాతీర్థపాళిఁ
జూడ నేగెద సెలవిమ్ము చూడ్కు లలర ॥ ॥17॥

మ॥ తన వామాంకమునం దలంకరణ సీతాలోకనాసక్తుఁడై
ఘన రత్నోజ్జ్వల సత్కిరీటధరు రాకాచంద్రబింబాస్యుఁ గాం
చన సింహాసన సంస్థితున్ రవిజ పర్జన్యాత్మసత్పౌత్ర పా
వని సౌమిత్రి ప్రసేవితుండగు రఘుస్వామి న్భజింతు న్మదిన్ ॥ ॥18॥

చ. కలహము లేల మానవుఁడు గాఁడుసుమీ రఘురామచంద్రుఁ డి
యిల జనియించె రాక్షసుల నే పడఁగింప భుజంగతల్పముం
దొలఁగి జగన్నియంతయగు తోయజనాభుఁడు దృష్టిపాత్రుఁడున్
సలలితమౌ మహామహిమ సర్వజగంబులు సన్నుతింపఁగన్ ॥ ॥19॥

మ. పదియార్వేల పసిండి కంబములచే భాసిల్లు గేహంబునం
దుదయాదిత్యకర ప్రఫుల్ల కమల ప్రోదంచితచ్ఛత్రు, నం
గద కోటీర విభీషణున్ భరతముఖ్యభ్రాతృ సంసేవితున్
సదయాత్మున్ రఘురాము నీరదఘనశ్యాముం దలంతున్మదిన్ ॥ ॥20॥

చ. సరసవిదేహ రాజ తను జారతు లక్ష్మణ యుక్తు దేవతా
తరుసుమ పూజితాంఘ్రివరతామర సద్వితయున్ సరస్వతీ
శ్వరసురవర్య మౌని జనవందితుఁ జందనచర్చితున్, లస
ద్గురుశర చాపధారణు, రఘూద్వహు, రాముని నెంతు నెంతయున్॥ ॥21॥

శా. ఓరామా ! జగదేకవీర ! రమణా ! యోజానకీనాయకా !
యో రాజేంద్ర ! కృపాలవాల ! వరదా ! యోవిశ్వ ! విశ్వావనా !
యో రాజీవ దళాక్ష ! యో రఘుపతీ ! యోనాథ ! మన్నింపు నా
నేరం బేను గృతఘ్నుఁడన్ గృపణుడ న్నిన్నే మది న్నమ్మితిన్ ॥ ॥22॥

శా. శ్రీరంగేశ పదాబ్జలబ్ధహృదయున్ శ్రీచందనస్థాన వి
స్తారోద్యన్మణి పీఠసంస్థితు లసచ్చక్రాబ్జ హస్తాబ్జ శృం
గారాకారు వికుంఠధాము నహిభుక్పర్యంక శాయిన్ హరిన్
శ్రీరామున్ ధరణీసుతాయుతు నతార్తిఘ్నున్ భజింతు న్మదిన్ ॥ ॥23॥

ఉ. శ్రీరఘురాము పాదసరసీజములందలి చూడ్కికాంక్ష పెం
పారఁగ భక్తి యుక్తి ననయంబుఁ జరించుచునుండు మానసం
బారయఁగాఁ జతుర్విధ ఫలాప్తికమౌ నిరతంబులైన పం
కేరుహపాళియందుఁ బరికింప రసం బొకటై ప్రవర్తిలున్ ॥ ॥24॥

మ. పరులున్ శిష్యులుఁ దల్లిదండ్రులును విప్రశ్రేష్ఠులున్ మిత్రులున్
శరణార్థుల్ కల రస్మదీయులు మహాస్వామీ ! భవాబ్ధిస్థితుల్
వెఱపుం గాచెడివారిఁ బ్రోచుటకు నీవేతప్ప లే రన్యు లే
మర కాపన్న శరణ్య ! ప్రేమఁగను రామా ! యార్తరక్షామణీ ॥ ॥25॥

మ. శ్రితమందార వినూత్నరత్న విలసత్సింహాసనాసీను భా
సిత నీలోత్పల మేఘవర్ణు గరుణాసింధున్ బ్రసన్నాననున్
నత పక్షున్ భువనైక నిత్య నిరతానంద స్వరూపున్ సురా
ర్చితు శ్రీరాము ధరాధినాథు మది నర్చింతు న్మదిష్టాప్తికిన్ ॥ ॥26॥

ఉ. శ్రీరఘు రామ నీదు పదసేవయు భక్తి నిరంతరంబు మా
కారయ నిష్టమైనవర మద్దియె చాలును మాటిమాటికిన్
గోరెద నీవరంబు నినుగూరిచి యన్యవరంబు లెవ్వియుం
గోరను నాయభీష్ట మొనగూర్చగదే కరుణించి మక్కువన్ ॥ ॥27॥

చ. నిరతము త్రోవ నేగుతటి నెయ్యముతోడ మదగ్రచారివై
గర మనురక్తి నుద్ధతిని గౌశలమొప్పగ లక్ష్మణుండవై
శరము శరాసనంబుఁ గవచంబును ఖడ్గముఁదాల్చి ప్రోవవే
తరణి కులాబ్దిసోమ వరతారకనామ శ్రితావనాచ్యుతా ॥ ॥28॥

మ. అలనా డార్తిని బిల్వ నా కభయ మాకాశవాణిధ్వనిన్
బలుకా వాక్యము సత్యమా జయము సౌభాగ్యంబు నా దెట్టిదో
తెలియన్నేరక విన్నవించితిని యేతీరైన నన్ బ్రోవు ని
ర్మల నీవే గతి కావవే దయను రామా యార్తరక్షామణీ ॥ ॥29॥

మ. జగము ల్సేయగఁబెంపఁజంప నొకఁడై శక్తీద్యుఁడై తన్ను గె
ల్వగ నమ్మాయ కసాధ్యుఁడై మది దలంపన్ రాక సానందుఁడై
తగునైర్మల్యముఁదాల్చి స్వీయ బహుతత్త్వజ్ఞుండునై యొప్పు నా
జగదీశు న్నిజబోధరూపు రఘువంశశ్రేష్ఠు భావించెదన్ ॥ ॥30॥

మ. ధరలో దొల్లిటివారు నేను సరిగా దైన్యంబునన్ వేడ మున్
వెర పేలంచును నియ్యవే యభయముల్, నేడేమి వింతాయనా ?
శరణార్థిన్ దిగనాడరా దెఱుగవా సర్వేశ ! నీ విచ్చి యే
మరినన్ వద్దనువార లెవ్వ రిక రామా ! యార్తరక్షామణీ ॥ ॥31॥

ఉ. అంతిపురంబునన్ దశరథాధిపుముంగల మాతృమధ్యమం
దెంతయు నాటలాడుతరి హేమమణిప్రదనూపురంబు లా
క్రాంతనితంజ ఘంటికలు రంజిల ముత్యపురావిరేకయున్
వింతగ జెన్నుమీరు రఘువీరకుమారు నుదారు నెన్నెదన్ ॥ ॥32॥

చ. జగముల కాధిభూతమవు సర్వజగద్వలయాశ్రయుండవున్
జగమవు నీవ భూతచయసంభరితుండవు నయ్యు వేఱె యొ
ప్పుగఁ గనుపింతు వీవయన పూనిక నా ప్రణవంబుతోడఁ బ
ల్కగ నగు మేటి వీవ భవలంపట మానస దూర్తవాహనా ॥ ॥33॥

నమ్మిన నిన్నె నమ్మవలె రఘునాయక నీతోడు
నెమ్మది నీవలెఁ బ్రోచెడు దొర లెమ్మిక మఱి లేదు
యిమ్మహి నీదాసునిగా నను బ్రహ్మ నిల్పినాడు
గ్రమ్ముకొనెడు నాపదలెల్లను బహుసమ్మతితోడను జిమ్మెడిదొరవని॥ ॥34॥

మ. శర ణాపన్నశరణ్య ! రాఁగదవె హెచ్చా నా మనస్తాపమున్
నిరసింప న్భువి నీకుఁ గట్టడగదే నీవే గదా యేమి మున్
శరణం బన్నవిభీషణాదులమనస్తాపంబు వారింపవే
మఱి నా కెవ్వరు నీవయా శరణు రామా ! యార్త రక్షామణీ ! ॥35॥

శా. కస్తూరీతిలకాననుండు మహితాకర్ణాంతనేత్రుండు దే
వస్తుత్యాంఘ్రిసరోరుహుండుఁ గరుణాపాంగేక్షణుం డంచితా
గ్రస్తో దస్త కళాకలాపుడు మణి ప్రస్ఫీత సత్కుండలుం
డస్తో కోజ్జ్వల కీర్తి ధాముఁడు మదీయాత్మన్ బ్రసన్నుండగున్ ॥ ॥36॥

చ. వశుఁడుగ మ్రొక్కెదన్ లవణవార్ధి విజృంభణతానివర్తికిన్
దశదిగధీశమౌళిమణి దర్పితమండనదివ్యమూర్తికిన్
దశశత భానుమూర్తికి సుధామృత భాషికి సాధుపోషికిన్
దశరథ రాజుపట్టికిని దైత్యపతిన్ బొరిగొన్న జెట్టికిన్ ॥ ॥37॥

ఉ. నల్లనివాడు పద్మనయనంబులవాఁడు మహాశుగంబులన్
విల్లునఁ దాల్చువాఁడు కడు విప్పగు వక్షమువాఁడు మేలు పైఁ
జల్లెడువాఁడు నిక్కిన భుజంబులవాఁడు యశంబు దిక్కులం
జల్లెడువాఁడు నైన రఘుసత్తముఁడీవుత మా కభీష్టముల్ ॥ (పోతన)॥38॥

సీ. చోరుడై వారాశి దూరుచోరుని జీరి మీఱు చారువిహార ! మేలుకొనుము
మేటితాబేటి నెమ్మేనున మందర శైలమెత్తిన ధీర ! మేలుకొనుము
ఘోణివైసంభృతక్షోణవైరిపుయుద్ధకేళిఁగూల్చినశూర ! మేలుకొనుము
భక్తు మాటలఁబట్టి బలుకంబమునఁ బుట్టి మెఱసిన నరసింహ మేలుకొనుము

॥39॥

లీల వటువృత్తిఁ గొనుధన్య ! మేలుకొనుము మేదినీశ ప్రవర్ధన ! మేలుకొనుము
శూలి కోదండ ఖండన ! మేలుకొనుము లీల నీలాంబుద శ్యామ ! మేలుకొనుము ॥
॥40॥

చ. మునుకొని దేవ ! నీవు కనుమూసిన లోకము లస్తమించు నీ
కనుగవ లిచ్చిచూచిన జగత్త్రయి మేల్కొను విష్ణుమూర్తి వే
నినుఁగొనియాడఁగాఁ దరమె నిద్దుర మాని జగంబుఁ బ్రోవవే
మనుకులనాథ ! యంచుఁ బలుమాఱులు చీరి నుతు ల్ఘటింపగన్ ॥ ॥41॥

గీ. మెల్లమెల్లనఁ గనువిచ్చి మేలుకాంచి యంబువులఁ బాద ప్రక్షాళనంబు సల్పి
చల్వ పందిటినీడ వేఁ జెల్వు మిగుల కొల్వుఁ దీరిన కోదండ గురుని గాంచి ॥॥42॥

సీ. పరగ విహాయసపద్ధతి గైకొని వెలి లోపలఁ జరించువిభుఁడి నీవె
పొలుపుగ వైకుంఠ పురమందు నివసించి సనకాదినుతులందు స్వామి వీవె
పెక్కురూపములచేఁదక్కక భక్తులఁగాచిసంరక్షించు ఘనుడవీవె
తిరుమలరంగాది దివ్యదేశములందు విగ్రహాకృతులచే వెలసి తీవె. ॥ ॥43॥

గీ. సర్వపరిపూర్ణుఁడవు నీవె సాధుహృదయ సంగతుఁడ వీవె మఱియు నిస్సంగి వీవె
నేడు మముఁబ్రోవ దలసిన వాడ వీవె రామ ! వైకుంఠధామ ! సంపూర్ణకామ ! ॥
॥44॥

గీ. శంఖ చక్ర గదాఖడ్గ శార్ఙ్గ గరుడ వాహనాదులు మాని యిక్ష్వాకు కులము
ఖ్యాతిఁ గైకొని మానుషాకార మూని నట్టి నిన్నాశ్రయింతు పట్టాభిరామ!
॥ 45 ॥

క. సాకేత నగర రాజ్యము వైకుంఠము – నీవె హరివి – వైదేహి రమా
కోకస్తని – యీకపు లా వాకపులు యథార్థమిది ఘృణాగుణజలధీ ॥
॥ 46 ॥

గీ. అవధరింపుము దేవ ! పరాకు మాని సురగణంబులుఁ ద్రిపురసంహరుఁ డజుండు
మఱియుఁ బ్రహ్లాద నారద మౌనివరులు గాచియున్నారు గొల్వుకై కాంక్షచేసి ॥ ॥47॥

క. శ్రీరామచంద్ర ! జగదాధారా ! దివ్యావతార ! దాస శరణ్యా !
కారుణ్య సార ! రవికుల పారా ! భవ్య ప్రచార ! యఖిలాధారా!॥ ॥48॥
॥48॥

ఉ. ఈయఖిల ప్రపంచమున కీవు విభుండవు నీయవాచ్యమౌ
మాయ నెఱుంగ మాతరమె మానుషభావము బూని యాదినా
రాయణమూర్తివై యనుచరావళి గొల్వఁ దురంగమెక్కి వేం
చేయుము కాలయాపనము సేయగ నేల మహాత్మ ! యింపుగన్ ॥ ॥49॥

ఉ. అవ్యయ మప్రతర్క్య మఖిలాశ్రయ మక్షయ మాద్య మార్యసం
స్తవ్య మనం దనర్చు పరతత్వము నీవయ సృష్టి సాధన
ద్రవ్య గుణాత్మ తత్వమున దాలుతు వేతనువైన జూపు మ
ద్దివ్య శరీర మిందఱకు దేవ ! కనుంగొన వేడ్క యయ్యెడిన్ ॥ ॥ 50 ॥

సీ. మంచురాయంచల మించుతురంగంబు నంచు గాఁగ నలంకరించి తెచ్చి
గురుతుగా నెదుటను గోరి సుమంత్రుండు గాచుక యున్నాఁడు కంజనేత్ర!
లెమ్ము వేగమె చందనమ్ము పూయుము మంచి సొమ్ములెల్లను దాల్చుకొమ్ము ఫలము
సమ్మతితోడ గైకొమ్ము వీడెము లివె నిమ్మళంబుగ నందుకొమ్ము వీని॥ ॥ 51 ॥

తే. నిన్ను నమ్మినజనములు సన్నుతింప పట్టుపుట్టంబు పై పిఱుచుట్టు చుట్టి
వల్లె వాటుఁ గిరీటంబు వాసి గుల్క దురగరాజంబుపై నెక్కు తోయజాక్ష!॥ ॥52॥

సీ. ముక్తాతపత్రంబు మునుకొని మెఱయంగ మహిత పార్శ్వములఁ జామరలు దనర
వీణగాన విచిత్ర వివిధ వాద్యంబులు చెవుల పండువులుగఁ జవులు గొల్ప
నజభవామర సనందాది మునీశ్వరుల్ వినుతి గావించి మీ ఘనత దెల్ప
గొప్ప బాబా నెక్కి గుణము సారించుచుఁ జిత్ర సంగతుల విచిత్రగతుల ॥
॥ 53 ॥

గీ. జూపుచును గల్కి చూపుల సొంపు జగము
లెల్ల మోహింపఁ జేయుచు నుల్ల మలర
సార్వభౌముండు శ్రీరామచంద్రవిభుఁడు
సాధు హృద్వీధియందున స్వారి వెడలె. ॥ ॥ 54 ॥

గీ. ఈవిధంబున స్వారి వేంచేయువేళ
సకలజనములు సంతోషసంభ్రమములు
మనములందునఁ బెనగొన మరలి స్వామి
రాక గోరుచు నుండిరి రమణతోడ ॥ ॥ 55 ॥

గీ. ధరణిలో నిజదాసులఁ దలఁపకొలఁది
సరస బహురూపములు దాల్చి సాధుజనుల
గుఱుతు చెడకుండ రక్షించు కోవిదుండు
పరమపురుషుండు హరిభక్త బాంధవుండు ॥ ॥ 56 ॥

ఉ. చాల విశాల నేత్రములు చల్లని చూపులు మందహాసమున్
మేలి పసిండి చేలమును మించు కిరీటము హారవల్లరుల్
నీల నిజాంగమున్ మెఱయ నీదగు భక్తికి మెచ్చి నే డిటన్
బాలుడ వైన నిన్ను హరి పాయక యుండుసుమీ సుపుత్రకా ॥ ॥ 57 ॥

ఉ. కావున నీవు దేహధనకాంక్షల జేరక భక్తితోడతన్
శ్రీ విభుఁడైన మాధవుని సేవ లొనర్పుము ముక్తి గల్గు నా
దేవుఁడు నీ హృదబ్జమున దివ్యముగా వసియించు నమ్మికన్
పావనమైన బుద్ధిని స్వభావము గైకొనవయ్య పుత్రకా ॥ ॥ 58 ॥

క. ఇంతయును దధ్యమని మది
నెంతయుఁ దెలియంగ లేరు హీనాత్ములు దు
ర్ధాంత తర ఘటిత మాయా
క్రాంతాత్యంత ప్రకాశ గౌరవ జడులై ॥ ॥ 59 ॥

క. భావము గలమనుజుల యెడ
భావజగురుఁడెపుడు నిల్చు పరమాప్తుండై
భావ విరుద్ధము గలిగిన
దేవతలకు నైనఁ జూడ దెప్పర మనఘా ॥ ॥ 60 ॥

క. కోరినవారలకెల్లను జేరువ కైవల్యపదము సిరివరునికృపం
గోరనివారల కెల్లను దూరము కైవల్య మెన్ని త్రోవలనైనన్ ॥ ॥ 61 ॥

సీ. కందర్పజనకుండు కళ్యాణ సదనుండు స్వామి వేంచేసెను సఖియ నేడు
పద్మజరిపుఁజూడఁ బరగెనో జంభారి వీటి కేతెంచెనో వేగహరుని
పట్నమౌ కైలాస పర్వతంబునకును జనుదెంచెనో దాసజనుల హృదయ
కమల కర్ణికలందుఁ గడుఁ జిక్కు పడియెనో
వైకుంఠపుర రాజ్య వైభవమున ॥ 62 ॥

తే. దగిలి మమ్ముల మఱచెనో దయ యొకింత
దోచ దాయెను నావంటి దోషనిధిని
జూడ దగదంచు దడసెనో సుందరాంఘ్రు
లెదను గనకున్న ప్రాణంబు లెట్లు నిలుచు ॥ ॥ 63 ॥

గీ. రాకుమారునితోడ బరాకు దెల్పు
వార లెవ్వరు లే రౌకో వార్ధిధీరు
జాడదెల్పెడు నాప్తుల జూడ గలుగు
భాగ్య మెన్నడు గలుగునో పంకజాక్షి ॥ ॥ 64 ॥

క. మావంటి భాగ్యహీనుల
కామహిత గుణాబ్ధిసేవ మహిదక్కుట కుం
గావలయు పూర్వపుణ్య ప్ర
భావము లే కెట్లు గలుగు పంకజనేత్రీ ॥ ॥ 65 ॥

గీ. చూడరే మీరు హరిజాడ సుదతులార
వేడరే హరి రమ్మని వేడ్క మీర
బాడరే విష్ణు కథలను బడతులార
జాగు లేటికి వెదకరే సదయలార. ॥ ॥ 66 ॥

క. తడవాయె నే మొనర్తుము
కడు దూరం బేగెనొక్కొ కంజాక్షుం డీ
యెడ రాడాయెనుటంచును
తడబడు సుజనులను జూచి తగ నిట్లనియెన్ ॥ ॥ 67 ॥

సీ. మానితశ్యామాయ మాన శరీర దీ
ధితులు నల్దిక్కుల దీటుకొనఁగ
కాంచన మేఖలాకాంతులతోడఁ గౌ
శేయచేలద్యుతు ల్చెలిమి సేయ
లక్ష్మీసమాయుక్త లలితవక్షంబున
వైజయంతి ప్రభ ల్వన్నెఁ జూప
హాటక రత్న కిరీటకోటి ప్రభ
ల్బాలార్క రుచులతో మేలమాడ ॥ ॥ 68 ॥

గీ. లలిత నీలాల రుచి కుంతలములు దనర
ప్రవిమలాత్మీయదేహ సత్ప్రభ సరోజ
భవ భవామర ముఖ్యుల ప్రభలఁ జూప
నఖిల లోకైక గురుఁడు నారాయణుండు ॥ ॥ 69 ॥

చ. సలలిత శంఖచక్ర జలజాత గదా శరచాప ఖడ్గ ని
ర్మల రుచులన్ సువర్ణరుచి మన్మణికంకణ ముద్రికా ప్రభా
వళు లొగి తేజరిల్ల భుజపాళి యనర్గళ కాంతియుక్తమై
విలసితకర్ణికార పృథివీరుహమున్ బురుణింపఁ బట్టుగన్ ॥ ॥ 70 ॥

క. సరసోదార సమంచిత
దరహాస విలోకనములఁ దగ లోకములన్
బరితోషము నొందించుచుఁ
బరమోత్సవ మొప్ప విశ్వబంధుం డగుచున్ ॥ ॥ 71 ॥

చ. మఱియును రాజహంసరుచిమద్భ్రమరీకృతతాంతవృంత చా
మర లిరువంకలన్ దివిజమాన్యలు వీవ సుధామరీచి వి
స్ఫురిత సితాతపత్రరుచి పుంజము దిక్కులఁ బిక్కటిల్లగా
గరివరదుండు వచ్చె సుభగస్థితి మొప్ప సుపర్ణయానుఁడై ॥ ॥ 72 ॥

సీ. ఒనరఁ బార్శ్వముల నిర్వురు సలామనుచును
తగమేన పయిడి చోప్‌దారు లమర
రాజాధిరాజ మారాజ పరాకంచు
హెచ్చరించెడి భటు లిచ్చ దనర
సంగీత సాహిత్య సరస మృదూక్తుల
కవిజన వంది మాగధులు పొగడ
భేరీమృదంగ గంభీర స్వనము మ్రోయ
నప్సరసలు గూడి యాటలాడ ॥ ॥ 73 ॥

గీ. పరగ వేయి కంబముల మంట పంబులోన
కోటి సూర్య ప్రకాశత కొమరు మిగుల
కొలువు దీర్చిన నిను జేరికొలువ వలదె
రామ రణరంగభీమ భద్రాద్రి ధామ ॥ ॥ 74 ॥

గీ. అవనిజయు నీవు నొక్క సింహాసనమునఁ
గమలబాంధవు గతి దేహకాంతు లమర
నిపుడు గూర్చుండఁ గనుఁ గొంటి సఫలమయ్యె
జన్మ మోరామ యామినీచరవిరామ ॥ ॥ 75 ॥

చ. ఘనుఁడగు రామచంద్రు పదకంజములే మది నిల్పి వేడుకన్
జనకజఁ బూజచేసి మదిఁ జారుతరంబుగ నాంజనేయునిన్
వినయముచే నుతించి పరవీరభయంకరుఁడైన లక్ష్మణున్
బ్రణుతి మొనర్చి యెల్లప్పుడుఁ బ్రార్థన చేసెద నిష్టసిద్ధికిన్ ॥ ॥ 76 ॥

హరామరేశసారసోద్భవాదులెల్ల నిన్ను నీ
చరాచరేశ్వరుండవంచు సంస్మరించి ధన్యులై
విరాజమానులైరి యౌర విశ్వరూప శ్రీహరీ
పరాకు భద్రశైలరామ భక్త కల్పక ద్రుమా ॥ ॥ 77 ॥

ధరా సుతామనోహరా సుధాకరాభమానసా
ఖరాసురాదివైరిబృంద ఖండన ప్రతాప వి
స్ఫుర ద్భుజాంగ దాది కోటి సుందరాంగ శ్రీకరా
పరాకు భద్రశైలరామ భక్తకల్పక ద్రుమా॥ ॥ 78 ॥

పరాత్పరేశ దుష్కృత ప్రభంజన ప్రభంజనా
పరాశ్రితాళి పంకజ ప్రభాకర ప్రభాకరా
శరాసనాది భీషణోల్ల సద్గుణాలి సద్గుణా
పరాకు భద్రశైలరామ భక్తకల్పక ద్రుమా ॥ ॥ 79 ॥

హిరణ్య ధారుణీంద్ర ధీరహారహీరశీత భూ
ధరామరాపగా లసత్సుధాకరాబ్జభా
స్వరాంతరంగ కాంతిహాస చారుకీర్తి సంయుతా
పరాకు భద్రశైలరామ భక్తకల్పక ద్రుమా ॥ ॥ 80 ॥

సరోజనేత్ర పంచ పంచచామరాఖ్యముల్ రచిం
చిరత్న కంఠహారమేను చెన్నుగా నొసంగితిన్
పరిగ్రహింపు మోరమేశ భక్త పాలనాచ్యుతా
పరాకు భద్రశైలరామ భక్తకల్పక ద్రుమా ॥ ॥ 81 ॥

సీ. శ్రీకరాకార లక్ష్మీమనోజ్ఞ విహార ప్రవిమల సువిచార బహుపరాకు
గౌతమీసతిశాపకలుష విమోచనా బలరిపునుత రామ బహుపరాకు
కౌసల్యానందన ఖగపతిస్యందన పవనజహితరామ బహుపరాకు
అగణిత మణిమయ హాటక భూషణ భవభయశోషణ బహుపరాకు ॥ ॥ 82 ॥

గీ. భవ్యసుందర నృపవేష బహుపరాకుభాగవత ముఖ్య సంసేవ్య బహుపరాకు
భద్రశైలోపరిస్థిత బహుపరాకు భక్తమందార రఘువీర బహుపరాకు ॥ ॥ 83 ॥

సీ. పలుమరు వేడిసఁ బలుకకున్నా వేమి పతితపావననామ బహుపరాకు
సన్నుతించిన వినకున్నావు మేలౌనె పన్నగాధిపతల్ప బహుపరాకు
దేవాదిదేవ ప్రభావ భాస్కరతేజ పావనాంఘ్రి సరోజ బహుపరాకు
బరునిగాఁ జూచినఁ బరు లెవ్వ రిక దిక్కు
పరమదయానిధే బహుపరాకు ॥ ॥ 84 ॥

గీ. పంకజాసన వందిత బహుపరాకు భావభవకోటి లావణ్య బహుపరాకు
భద్రశైలోపరిస్థిత బహుపరాకు భక్తమందార రఘువీర బహుపరాకు ॥
॥ 85 ॥

సీ. జనకజాధిప రామచంద్ర మహాప్రభో పవనజహిత రామ బహుపరాకు
నీలమేఘశ్యామ నిజజనావనకామ పవనజహిత రామ బహుపరాకు
దశరథనందన దశకంఠమర్దన పవనజహిత రామ బహుపరాకు
సాకేతపురవాస సదమలమృదుభాష పవనజహిత రామ బహుపరాకు ॥
॥ 86 ॥

గీ. బాలశశిఖండ ధరనుత బహుపరాకు ఫాలలోచన సతిహిత బహుపరాకు
భద్రశైలోపరిస్థిత బహుపరాకు భక్తమందార రఘువీర బహుపరాకు ॥
॥ 87 ॥

సీ. మాటలసందడి మమ్మేమఱితివేమొ పదిలమహోరామ బహుపరాకు
దీనజనత్రాణ దీక్షను మఱచితొ పదిల మహోరామ బహుపరాకు
నీ దాసజనులకు నే సేవకుడగాన బదిలమహోరామ బహుపరాకు
అమ్మకుండగ దాచుకొమ్ము నీ సొమ్మిది పదిల మహోరామ బహుపరాకు ॥
॥ 88 ॥

సీ. పరుల నొప్పింపకుమి రామ బహుపరాకు
పౌరుషము నీదె సుమి రామ బహుపరాకు
భద్రశైలోపరిస్థిత బహుపరాకు
భక్తమందార రఘువీర బహుపరాకు ॥ ॥ 89 ॥

అర్థి కిచ్చినవరం బపుడె మఱచెదట పదిలమహోరామ బహుపరాకు
అపకార మొనరించు నతని మఱచెదట పదిలమహోరామ బహుపరాకు
మఱచుటనీకిది మతి సహజంబట పదిలమహోరామ బహుపరాకు
మతి నన్ను నీగతి మఱచెద వేముకో పదిలమహోరామ బహుపరాకు ॥ ॥ 90 ॥

గీ. పంకజాక్ష రమాధీశ బహుపరాకు భవ్యనరసింహపోషక బహుపరాకు
భద్రశైలోపరిస్థిత బహుపరాకు భక్తమందార రఘువీర బహుపరాకు॥ ॥ 91 ॥

చరాచరాత్మక ప్రపంచ చాతురీ ధురీణుడౌ
విరించి యైన భక్తజాల వైద్యమై తనర్చు నీ
విరాజమాన సత్పదంబువేడ జాడ జాల నో
హరీ నమస్కరింతు నన్ను నాదరించి కావవే ॥ ॥ 92 ॥

కరంబులందు శంఖచక్ర కార్ముకాది సాధనల్
తిరంబుగా మెఱంగు లీనఁ దేజరిల్లఁ గోరి యా
కరీంద్రుఁ బ్రోచినట్టి నిన్నుగానఁ గోరినాడ నో
హరీ నమస్కరింతు నన్ను నాదరించి కావవే. ॥ ॥ 93 ॥

దురంత సంసృతిన్ మహోగ్ర దూషణాహితాత్ములై
నరు ల్పరుండవంచు నిన్ను నమ్మి కొల్వఁజాల రీ
మఱుం గెరింగినాఁడ నింక మారు పల్కనేర నో
హరీ నమస్కరింతు నన్ను నాదరించి కావవే ॥ ॥ 94 ॥

కురుక్షితీశు డల్లనాడు కోకల న్వదల్ప నో
చరాచరేశ కావుమంచు సన్నుతింప నంతనీ
వెఱింగి ద్రౌపదిన్ మనోగతేష్ట సిద్ధిఁ జేసితౌ
హరీ నమస్కరింతు నన్ను నాదరించి కావవే ॥ ॥ 95 ॥

ధరాపరాగ మెంచవచ్చు తారకాగణంబులన్
స్థిరంబుగా గణింపవచ్చు దేవదేవతావక
స్ఫుర ద్గుణాళి లెక్క పెట్ట శూలికైన శక్యమా
హరీ నమస్కరింతు నన్ను నాదరించి కావవే ॥ ॥ 96 ॥

సీ. మంగళం బిదె నీదు మందహాసమునకు మంగళంబిదెనీదు మకుటమునకు
మంగళం బిదె నీదు కుటిలాలకములకు మంగళం బిదె కుంద రదనములకు
మంగళం బిదె మృగమదరేఖకును దివ్య మంగళం బిదె కృపాపాంగములకు
మంగళం బిదె నీదు మణికుండలములకు మంగళం బిదె మహాభరణములకు ॥97॥

గీ. మంగళం బిదె కోదండ మహిమములకు
మంగళం బిదె కిసలయ పాదములకు
మంగళంబిదె నీదు నామంబునకును
భద్రగిరివాస మాంపాహి పాహి రామ ॥ ॥ 98 ॥

సీ. శ్రీమంతుఁడై నిజాశ్రితులఁ భావింపంగఁ
బ్రభు దశరథుకూర్మిపట్టి యగుచు
మౌనియాగముఁ గాచి మహి సాంబశివువిల్లు
ఖండించి జానకిఁ గడు ముదమున
జేకొని జనకుని చిత్తానుసారియై
కాననంబున కేగి ఖరుఁడు మొదలు
గాఁగల దనుజులఁ గడువేడ్క దనుమాడి
కడఁగి రావణు, కుంభకర్ణుఁ గూల్చి ॥ ॥ 99 ॥

గీ. కీర్తికాంతను బొంది సాకేతపురికి
శీఘ్రమున వచ్చి పట్టాభిషిక్తుఁ డగుచుఁ
బెద్ద తడవు సభాస్థలిఁ బ్రీతి నిలిచి
కొలువుఁ జాలించె శ్రీరఘుకుంజరుండు ॥ ॥ 100 ॥

సీ. పుష్యరాగములకుఁ బుట్టిల్లు నట్టిల్లు
నెలరాల రంగు గోడల మెఱుంగు
మహిత విద్రుమముల మఱిగెల గౌఱిగెలు
కెంపుల గుంపు వాకిండ్ల సొంపు
నిలువుటద్దంబుల మెలుపులు తలుపులు
రతి పచ్చడాలు తోరణపు చాలు
నెరపిన ముత్యాల నిగ్గులు ముగ్గులు
మగరాల మెచ్చు మేల్జగతి హెచ్చు ॥ ॥ 101 ॥

గీ. తళుకు బంగారునీరు చిత్రములతీరు
లలిత నీలంపుమించు జాలముల సంచు
గలిగి యాగతి నమిత శృంగార కలిత
మైన నగరంబునకు రాముఁడరిగి యచట ॥ ॥ 102 ॥

చ. చెలువము గుల్క పొందళుకుఁ జెందిన కోళుల సొంపు నింపు ని
గ్గలు గల కెంపుగుంపు జతఁ గూర్చిన పట్టెలఁ బట్టు పట్టెడల్
వలగొను నున్పుపాన్పుపయి వైఖరిపైఠిణి మేల్మి తల్గడల్
బలు చెలువొంది యందమగు పందిలి మంచముపైని బొందుగన్ ॥
॥ 103 ॥

క. శ్రీ సీతామణి తోడుత భాసురముగ నేడు శేషపర్యంకమునం
దాసీనుఁ డగుటకై వి చ్చేసెడు సమయమిదె యేకచిత్తముతోడన్ ॥
॥ 104 ॥

క. కరములు మెగిడ్చి యెదుటను
గర మర్థి ఘటించి మ్రొక్కి కంజాక్ష హరీ
వరద పరమేశ యంచును
నిరతంబుఁ బరాకుఁదెల్పి నిల్వఁగ వలయున్॥ ॥ 105 ॥

గీ. ఇంచుకయు సద్దు వలదిఁక నిచట నుండ
నర్హు లగువారు భయభక్తు లతిశయముగ
దివ్యమంగళ విగ్రహు దేవదేవు
నిత్య కళ్యాణుపై మది నిల్పి మఱియు ॥ ॥ 106 ॥

సీ. అని యీవిధంబున ననఘురాము నుతించి
మెల్లమెల్లన వీణె మీటవలయు
దడయక రాగ యుక్తంబుగాఁ గవ గూడి
భక్తితో జోలలఁ బాడవలయు
నవ్యకరమ్ముల జామరల్ధరియించి
వేడ్కతో జల్లఁగా వీవవలయు
నత్తరు పన్నీరు ననువైన సుమములు
చక్కగాఁ బాన్పుపైఁ జల్లవలయు ॥ ॥ 107 ॥

గీ॥ పసిడి డోలికc జేతుల పట్టి యాచి
స్వాంతమున నుపచారము ల్సలుపవలయు
నీవిధంబున హరిసేవ లెవ్వరేని
సల్పు విబుధులు వైకుంఠసదనగతులు ॥ ॥108॥

సీ॥ శ్రీరమామణితోడc జెలcగి క్రీడ యెనర్చి మదనారిసన్నుత నిదురc బోవె
దనుజులతోడను దడయక పోరాడి కదిసి ద్రుంచిన రామ నిదురc బోవె
లేcడి వెంబడి చాలమోడి చేc బఱుగెత్తి వెదకి యలసి తిక నిదురc బోవె
తమ్ముని యాలిని దాcగొన్న యావాలి మద మడంచిన రామ నిదురcబోవె॥ ॥109॥

గీ॥ముదముతోc బూలపాన్పుపై సుదతి గూడి
మదనజనక కృపాలోల నిదురc బోవె
విదళితాఖిల రామ నిదురc బోవె
నిదురుబో భద్రగిరిధామ నిదురుబోవె ॥ ॥110॥

సీ॥ జలచరాకృతిc బూని చలముచే సోమకు విదళించుటలు మానినిదురc బోవె
కూర్మమై గిరినెత్తు గోరిన పరమాత్మ కుదురుగా శయనించి నిదురc బోవె
కిటిరూపమున ధరc గ్రింద నాగcగ నేల యెద నిమ్మళించుక నిదురc బోవె
మనుజపంచాననంబన దనుజునిబట్టి పొదలి ద్రుంచిన సామి నిదురcబోవె॥ ॥111॥

గీ॥ వదలకను వామనాకృతివైన నీవు
మొదలుగల రామ బలరామ నిదురc బోవె
సదమాలాత్మక రఘురామ నిదురc బోవె
నిదురుబో భద్రగిరిధామ నిదురc బోవె ॥ ॥112॥

సీ॥ ఇల బుద్ధరూపుచే బలు పతివ్రతలను జెదరజేసిన సామి నిదురc బోవె
కలికిరూపము దాల్చి ఖలులద్రుంచిన దేవ మది నిల్పి నిమిషంబు నిదురcబోవె
లోకంబు లెల్లను నీ కుక్షి నున్నవి పదిలంబుగా సుంత నిదురc బోవె
నరసింహదాసుc డేమరక నీపదములు వదలుకున్నా డింక నిదురc బోవె. ॥113॥

గీ॥ మదవతుల యాటపాటల ముదము నొంది
చిదచిదాత్మక రఘురామ నిదురc బోవె
యు దయ భాస్కర నిభతేజ నిదురc బోవె
నిదురcబో భద్రగిరిధామ నిదురc బోవె ॥ ॥114॥

చ॥ స్థిర మతితోడు తూము నరసింహుడొనర్పెడి సేవకున్ముదం
బురు సుఖమొంది కమ్మెగిచె భూసుతతోడ రఘూద్వహుండహో
హరి శుచి ధర్మకోణత ఫలాధిప మారుత యక్షనాయకే
శ్వరులు కరంబు జాగ్రత సువాహన సాయుధులై చరించుడీ ॥ ॥115॥

సీ॥ చట్టురా కూతుఁ జేపట్టిన చెలికాని మేటి సన్నుతి విని మేలుకొనవె
పలుభామ లాడెడు పణతి జేసెడు నుతులాలింప వేళాయె మేలుకొనవె
కుసుమ పర్యంకంబు కసిగంది యున్నది మేలాయె నిక నిద్ర మేలుకొనవె
గరుడ తురంగంబు గదిసియున్నది స్వర్ణ చేల కీర్తివిశాల మేలుకొనవె ॥ ॥116॥

గీ॥ లీలసల్పెడు సమయము మేలుకొనవె
శూలిరిపుకేళి యిక చాల మేలుకొనవె
మేలు రవివంశతిలక మమ్మేలుకొనవె
మేలుకో భద్రగిరిధామ మేలుకొనవె. ॥ ॥117॥

సీ॥ నీవు కన్మూసిన నిఖిల ప్రపంచంబుఁ జాలిజెందిన దిక మేలుకొనవె
నీదు పాదయుగంబు నెమ్మి సోకకయున్న మేదిని వ్యథఁ జెందు మేలుకొనవె
నీవీక్షణము లేక నెరిదిశ లెల్లను జాలచీకటి గప్పె మేలుకొనవె
నా ప్రసన్నత లేక నిగమముల్విముఖత మూలమూలల జొచ్చె మేలుకొనవె॥॥118॥

గీ॥ ఫాలలోచన సతినుత మేలుకొనవె
గాలికూరిమితనయాఢ్య మేలుకొనవె
మేలు రవివంశతిలక మమ్మేలుకొనవె
మేలుకో భద్రగిరిధామ మేలుకొనవె ॥ ॥119॥

సీ॥ జారచోరకుల సంచారంబు లడగెను వాలాయముగ నిద్రమేలుకొనవె
ఖలు లిక సాధుల గారింపు చున్నారు జాలి దీర్చుటకునై మేలుకొనవె
దరి వేఱు లేక నీ దరిజేరికుయ్యిడు మేలి భక్తుల బ్రోవ మేలుకొనవె
నరసింహదాసును నరసిప్రోచుట నీదు పాలుగావున నిద్ర మేలుకోనవె॥ ॥120॥

గీ॥ కేల నగమెత్తు నాసామి మేలుకొనవె
లీల పదిరూపముల దాల్చి మేలుకొనవె
మేలు రవివంశతిలక మమ్మేలుకొనవె
మేలుకో భద్రగిరిధామ మేలుకొనవె ॥ ॥121॥

సీ॥ భరతాది సోదరు ల్ప్రణతులై యట నిల్చి కనుసన్న బనిచిన పనులొనర్ప
ప్రేమమీర వసిష్ఠ వామదేవాదులు మొనసి యాశీర్వాదములు ఘటింప
స్వామి పరాకు హెచ్చరిక హెచ్చరి కంచు సారె కంచుకులు హెచ్చరికఁ దెల్ప
మంత్రు లాశ్రితులు సామంతాదులెడనెడ
నెలమితోఁ బొగడంగఁ గొలువుసేయ ॥॥122॥

గీ॥ గుములుగొని మన్నెదొర లూడిగములు సల్ప
హైమ సింహాసనంబు పై నధివసించి
యుదయగిరి నిల్చు ప్రొద్దుతో నుద్దియగుచు
బెద్ద కొలువుండె దశరథుపెద్దకొడుకు. ॥ । ।123॥

గీ॥ దంతి వరదుడు నేడు శ్రీకాంతతోడ
బంతులాడెడు వేడ్క శ్రీమంతుడగుచు
కొలువు దీరెను జనులార కోర్కెదీర
గాంచుడీ భక్తి మదిలోన గడలుకొనగ. ॥ ॥124॥

క॥ కొందరు హరిదెస నిలువుడి
కొందరు శ్రీరమణిదిక్కు కూడఁడి యల గో
విందుడు రమ యాడెడి యా
సుందరమగు క్రీడ మిగుల జూడుడు వేడ్కన్.॥ ॥125॥



# భద్రగిరి శతకము

- శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

శ్లో॥ శ్రీరామచంద్ర ! యస్మద్ హృదురు వియత్ ప్రియతమ చంద్ర !
సారోపనిషదర్థభూత ! ముక్తి యోషామణీ క్రీత !
నీరధి భంగ ! భూమీసుతా మనో నీరజభృంగ !
నీరధర శ్యామ ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 1 ॥

శ్లో॥ మఱి యొక్క యూహ తోచెడిని, నాదు నీమాత్రమౌ పద్య
విరచనకే పొంగిపోయి శ్రీముక్తి విభవంబు నాకు
నొరిగింపనైన, నొడళ్ళు వరుగులై యుగములు తపము
నెఱయించుటేలొకో భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 2 ॥

శ్లో॥ ఎవ్వరో యెవ్వరో యయిన యీ దైన్యమెసగు కోరికలు
రువ్వటలో నర్థమొప్పు విశ్వేశ్వరుండును నీవు
నవ్వల మీయంత మీరు చేదుకో నవువారు నన్ను
నెవ్వగల్ కూర్పక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 3 ॥

శ్లో॥ మనసెక్కువగ నైహికమ్మగు దినుసు, మనసుతో మమ్ము
మననంబుచేసిన నైహికమ్ములౌ మహిమల నిత్తు
మనుకొన్ననదియేల ? యాత్మలో వచ్చి యవధరింపఁగల
నెనరె చూపింపుడు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 4 ॥

శ్లో॥ లావణ్యనిధి ! లక్షమంది రావణులం జంపుమీవు
భావంబులో నిన్ను నెంచఁ జివురాకు పగిదిభాసింతు
జీవంబులో నెంత మార్దవమ్మును జెందించఁగలవొ
నీవారశూకాభ ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 5 ॥

శ్లో॥ గ్రహములు తొమ్మిదిమంది, యైదు వర్ణమ్ములవారు
గ్రహముల సంచారగతిని నేను కిరాతబుద్ధి నయి
విహరింపవచ్చు నొక్కపుడు, చైతన్య విభవాంబురాశి !
నృహరి ! పాలింపవే ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 6 ॥

శ్లో॥ అన్ని రోగంబులు కుదిరినవి గాని యా రోగమొకడు
చిన్న మెత్తంతైనఁ గుదురలేదు రాజీవాక్ష ! రామ !
యన్నలా ! లగ్నమందున్న కుజుడును నసురగురుండు
నిన్ను గాదన్నట్లు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 7 ॥

శ్లో॥ మొగిఁ బాపమఱ నీదు మైవెలుగు మహంబులలో మునుగుట
కుగనెంచగా నొద్దు కచ్చితంబుగాఁ గోసినట్లుండె
దిగుటకు లేదింత దూకుటే కాక, ధృతి నిల్వ నీవు
నెగడించుటయె కాక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 8 ॥

శ్లో॥ ప్రోవుల నీళ్ళొక్కసారి వఱ్ఱుగా ముంచెత్తు నీదు
లావణ్య నది యొక్కసారి జివ్వన లాగివేసెడిని
దేవ ! నీదయ యెప్పుడెట్టులుండునో తెలియఁగఁజాల
నీవ కన్పడవాయె భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 9 ॥

శ్లో॥ వెసఁదెల్గు తెల్గంచు జనము వెఱ్ఱిగంతులు వేయుచున్నారు
దెసమాలు మాజాతి కీవొకండవు తెలుఁగుదైవమవు
కసితీర నుతియింతు నిన్ను దెలుఁగు వక్కణములతోడ
నిసిపోవఁ బగలురా భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 10 ॥

శ్లో॥ హరుఁడని నీవును నీవని హరుండు వ్యర్థపుచ్చకుడు
జరిపి నా ప్రార్థన మీరుమీరు వచ్చందాలు పోయి
చెరియొక చేయివేసినను జాలును చేరితి ముక్తి
నిరుపమాన దయాబ్ధి ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 11 ॥

శ్లో॥ కొనిపోయి నన్ను గైలాసమందొ వైకుంఠంబునందొ
గణములలోఁ బారిషదులలోఁ జేర్పగాఁ గోరలేదె
ననునేన పాపముల్ తొలచ మనసిగ్గికొన సాయపడగ
నెసరు చూపుడటంటి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 12 ॥

శ్లో॥ వడిఁబుట్టుచునె యున్నది ప్రజ, బాధలు పడుచునే యున్న
దొడుదుడుకు సుఖానికి జతనమ్ము చేయుచునె యున్నదియు
విడుదలలేదింత మెలికలోనుండి విడుదలలేదు
నిడుద యూర్పుల గమి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 13 ॥

శ్లో॥ తడవకు నెప్పటికపుడె సంసార తాపత్రయంబు
బెడదతోనె సరిపోవుచున్నది ప్రియతమ జ్యోతి !
నెడదకు నిను గదియించుకో నెప్డొ యెఱుగన, యెడద
నిడివి యాసఫలింప భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 14 ॥

శ్లో॥ తెలివిగా నెదొ చేయబోయి తలదూర్చి తీసికోలేక
వెలిమేనుగాలిలోఁ గొట్టుకో నఱపిట్ట నయ్యెదను
కలుగగాఁ గోదండ రమ్యమైన కైదండ యీవె !
నిలువద్రొక్కికొనంగ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 15 ॥

శ్లో॥ కొండపైఁ గోతి రమ్మన్నరాదు మాకును, నీవనుకొన
కుండఁ దానైవచ్చు రాక్షసవధ చేయును బయిపెచ్చు
కొండపైఁ గోతి రానక్కఱయె లేదు కోతియు నీవు
నిండియున్నారెద భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 16 ॥

శ్లో॥ విడివడి కట్టలు తెగిన మతిఁ బుల్లవిరుపు మాటలను
చెడిపోవుచున్నారు కొంతమంది నిం జేరగాలేక
వడి నాకు నీదయ ముదురు పాకాన బడక నిన్ గాద
నెడు బుద్ధి రాలేదు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 17 ॥

శ్లో॥ ఈ పద్యములు నీవు, నిట్టివేషాల నెందఱో వేతు
రీ పప్పులుడకవు, చచ్చినట్లుగా నింద్రియ జయము
ప్రాపింప జేసికో, తేరగా వచ్చి పడ దనె దీవు
నీపట్టు తెలియులే భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 18 ॥

శ్లో॥ ఈవెట్ట యిటులున్న నికనేమైన నున్నదా ! మండి
పోవుటయే కాక యింద్రియ జయమ్ము పొలుపేది నాదు
జీవవల్లరి వ్రాలుతీర, మారాకు చేరికగాగ
నీవు నిల్వకయున్న భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 19 ॥

శ్లో॥ పదవయ్య నాస్వామి ! విదియనాడు కన్పడని చందురుఁడు
తదియనాడైన గన్పడును, గన్పడి దారపు బోగు
పద యిత్తు నీలాపనింద తొలగించు, భక్తి మేల్కొను
నిదుర రానీకువే భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 20 ॥

శ్లో॥ నెఱిఁజచ్చునప్పుడు సంధ్యమంత్రమని బ్రదుకు చివరఁ
బరమమౌ నీ భక్తి సుంతగానైనఁ బట్టుకొన్న యది
కొఱ గ్రుడ్డిలో మెల్ల, ప్రాణముల్ గుటగుటలాడు
నెరపురాకయ మున్న భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 21 ॥

శ్లో॥ ఎక్కడనొక లిప్తయైన నీ భక్తి హీనమై చనునొ
యక్కటా యనిదిగుల్ పడెడునాకు నిద్రావధీరణయు
చక్కబ్రదుకు కృషి కనక తప్పనిసరియు నింతకును
నిక్కమీ వొకఁడవై భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 22 ॥

శ్లో॥ వగ నా శరీరస్థితి యెగదీసిన బ్రహ్మహత్యయును
దిగఁదీసినంగవీ హత్యయుగ నున్నది సుతపస్సరణ !
యెుగి దీనిరక్ష కష్టముగ నున్నది, యున్నదీచరణ !
నిగమాంత సంవేద్య ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 23 ॥

శ్లో॥ కథ నీది సూక్ష్మమతి రమణీయముగ రచించెద గద
కథ నాది పాలింపగారాదె స్థూలమ్ముగానైన నీవు
ప్రథితమ్ములిచ్చి పుచ్చుకొనుటలు నీకుఁ బట్టవో ముక్తి
నిధికి శ్రీశాలికి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 24 ॥

శ్లో॥ పుట్టించి పట్టించినావు కారాని పోరాని సంత
రెట్టించి ధట్టించినావు దుఃఖ దారిద్ర్యంబులెల్ల
కట్టించి ముట్టించినావు తీవ్రాగ్ని కాయంబునందు
నిట్టలమ్మౌ కృప భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 25 ॥

శ్లో॥ పట్టిన దయ్యమై, క్రిందఁబెట్టిన వానలు పైనఁ
బెట్టిన యెండలులేని దుశ్శీలు వీని రక్షింతొ
త్రుట్టెలుకట్టిన, జ్ఞానదగ్ధ కర్ములని చెప్పుటయు
నెట్టుచున్నది నన్ను భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 26 ॥

శ్లో॥ నోరు మాటాడుచో వెక్కిరింపనౌ నొస, లనుములను
బేరిమి దించు మిన్ములను జేతిలో బెట్టనౌ నిద్ది
తోరమైనట్టి లౌకికము దీనికి దూరమౌ దీవు
నేర నా దూరము భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 27 ॥

శ్లో॥ వలెనని యిది చూడ, ననుభవించగా వలెనని యిద్ది
తలపులో బాహిరవోయి యీ కట్టె తమ దయలేక
చలియించుచున్నది చలన సంగతా సాధుచేష్టముగ
నిలువరింపుము దీని భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 28 ॥

శ్లో॥ కనవలెనని శ్రావణాంబుధర శాబకమనోజ్ఞు నిన్ను
వినవలెననియు షడ్జస్వరమయూర వీరావు నిన్ను
కననేల విననేల యేటికీ రమ్యకాంక్షలు, చేయు
నిను నన్నొకటిగాగ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 29 ॥

శ్లో॥ స్వామి ! నన్నొకసారి యిట్లు దయచూచెఁ బరముఁడన్నట్టి
యామాట కొందఱితోడఁ జెప్పితి ననుచుఁ గోపమ్మొ
ఆ మొయి నీవైపు తిరిగిచూడవ యద్ది క్షమింపు
నీ మన్నన వచింప భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 30 ॥

శ్లో॥ చట్రమ్ములో బిగించితివి యటునిటు సాగనీకుండ
కుట్రచేసితి, లేదు వీలు కాల్లీసికోఁ, బులిమీది
పుట్రనా నిత్యమృత్యు భయమిదేమి ముక్తి వ్రతంబు
నిట్రుపవాసముల్ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 31 ॥

శ్లో॥ ఏడువలేక నవ్వుటయ యెంచిన నీ సృష్టియెల్ల
కాఁడువాలగు నేటి కడుపులో నిల్లుకట్టినయట్లు
వేడి నిల్లూర్పులగాదె యిదిదని వెలయని బ్రదుకు
నేడె తెలియరాదు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 32 ॥

శ్లో॥ చివరి యీ దినములలోన నొకరీతి జీవనాధార
సవదరింపగ సాయపడెదు పెంచి యాస జగదాధార !
తవిలి నాలో సాయపడవె ననునేను దహియించుకొంచు
నివురు కప్పికొనంగ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 33 ॥

శ్లో॥ వే తప్పుచేయును మరి క్షమింపగా వేడఁ గన్నీళ్ళ
నీతిబాహిరుఁడైన వాఁడు, నేను నా నీతిగాఁగలన
చేతో నియమ సర్వధర్మ పాలకా ! శ్రీరామ ! నాకు
నీతోలగించునా భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 34 ॥

శ్లో॥ నాయూహాయుఁ బ్రయాగవోలేఁ బొలుచు జానకిరామ ! యెపుడు
నీయూహ కలిమి గంగయుగ యమునగా నినుపైన కోర్కి
నా యీ సుకవితా సరస్వతియు నంతర్వాహినియుగ
నీయేమి తలచుటో భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 35 ॥

శ్లో॥ గుండెలో సుడివోలెఁదిరిగి ప్రాణముల్ కొఱవోయి యెడద
గండికొట్టినయట్లు తోచు జన్మదుఃఖపు టూహవచ్చి
బండలపై దూకి జారి పోకుండఁ బట్టుకోరాదె
నిండైన కృపతోడ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 36 ॥

శ్లో॥ ఊహకవధిలేని మనసు కలిగిన యులిపికట్టెకును
గాహితాఖిల విషయముగఁ దన్మయత్వము కలుగదు స్వామి !
యూహతోనే స్రగ్గిమ్రగ్గి వైరాగ్య మొదవించుకొంచు
నీ హేల తెలియనౌ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 37 ॥

శ్లో॥ చెట్టమానిసి, తన యులుకు బయట వేసికొని యెవ్వారొ
తిట్టినారంచు హోరుమని యేడ్చెడి తీరుగా నేను
కట్టిడి పాపముల్ చేసి నీవు నన్ గరుణింపవంచు
నెట్టవం చందును భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 38 ॥

శ్లో॥ మరి సిగ్గుచేటు నా పాపసంహతి మాట నీతోడ
సిరితావియును దెల్లనైన మల్లెపూ శీలమ్ము గలుగు
దొరతోడ నేమోము పెట్టికొని చెప్పుదును క్షమియింపు
నెరపుకల్గిన గుండె భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 39 ॥

శ్లో॥ చెడుగు మాటలు చేసినట్టి పాపము చెప్పినఁబోవు
నెడలఁ జేయుచునుండవచ్చుఁ జెప్పుచు నెపు డుండవచ్చు
పడినోరు మూసుక యనుభవింపగా వలయునే కద య
నెడు తెల్వియున్నది భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 40 ॥

శ్లో॥ ఇటువంటి పాపులు నుందురా యని యేల సందియుము
కటికవానికిఁ బాపమన్న యూహయే కలుగనివాని
కటునుండి నరుకుక రమ్మటన్న తీవ్రాశునకేమి
నిటలస్థమగు జ్యోతి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 41 ॥

శ్లో॥ నా కికెందుకు లేదుగాని రామచంద్ర ! యిది జుగుప్స
కాకరంబని యెఱింగియు జుగుప్స నిత్యంబును బడుచు
లేకిజన్మము కాక యేటికిఁ ద్యజింపలేనో యెఱుగను
నీ కాంతి యెఱుగను భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 42 ॥

శ్లో॥ కొడుకు కాంతారమ్ము చనిన నసువులఁ గ్రుంకె నీ తండ్రి
కొడుకు తా నసువులఁ గ్రుంక నేనింత క్రుంక, నీపేరు
కొడుకుకు బెట్టితి వాని బ్రదికించికొనను, నిన్ గాద
నెడు తీవ్రతయులేను భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 43 ॥

శ్లో॥ వసుధ నాకంటెను బుద్ధిమాలిన వాడు లేడనుము
పసివాఁడు వానిపైఁ బ్రాణములుపెట్టి బ్రదికితి, వాఁడు
నుసియయ్యె, మేనితో నేనుమాత్రము నుసికాను, దుఃఖ
నిశ వేగ నీయను భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 44 ॥

శ్లో॥ ఏడుపులో నట్టయడుగు నందున నెక్కడో నీదు
జాడ కన్పించు నా యేడుపైన నిచ్చట నేడ్వలేను
వ్రీడామనోహరమూర్తి నిన్ను దర్శింతునంచనఁగ
నీడజ హరివాహ ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 45 ॥

శ్లో॥ నమ్మకమ్మునఁ గొంత యప్పువెట్టి పంటలమీదఁ దీర్చి
కొమ్మనుటున్నది జగతి, నీవు నాకును గానిపించి
నెమ్మదిగా నఘప్రతతిఁ దూల్చికో నీ, వనుమాత్ర
నెమ్మి నీ యెదలేదు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 46 ॥

శ్లో॥ తోరపుటెద బాధ దంప నాగళ్లతో దమ్ముచేసి
నారుకట్టలు దగ్గరలుగ విసరిన న్గను పైన చేని
యోరిమిగా నుంటి స్వామి ! వెసవచ్చి యూడ్చుకోవయ్య
నీరమెండకయమున్ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 47 ॥

శ్లో॥ అది కాని దానియందున నకట ! అదియదియను బుద్ధి
పొదలదు నాకైన దానియందు నా బుద్ధి యున్నటుల
బొదలుచుందును నేనుగాని మెలకువ పూర్తిగా రాదు
నిదురయందున నుండి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 48 ॥

శ్లో॥ చేవ, వెల్గు వెలుంగె, మరియు చీకటి చీకటే, రెండు
నావెల్గు చీకటుల్ కలిసి యుండుట యన్నది లేద
యోవేధ ! గ్రుడ్డివెల్తురని లోకాన నున్నది స్వామి !
నీ వొప్పుకోవంతె భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 49 ॥

శ్లో॥ నిను నింతగా దలంచియు ప్రమాణమ్ము నేరను, జీవి
యనుభూతికిం బ్రమాణమ్ములేదు నీదగు దయకాక
యనువుగా గొలువవే ! వేసి యెన్ని నీ యడుగులు కలదొ
నెనరొప్ప నా భక్తి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 50 ॥

శ్లో॥ నాలోతు తెలియును నాకు, నేడ్చుట నా యెద వ్రస్సి
లోలమై యుబికెడు గ్రుడ్లనీ ర్గ్రుడ్లలోఁ గ్రుక్కికొనుట
వ్రాలు సంజల బ్రొద్దుపొడుపు వేళల రాపుపొందుటయు
నీలోతు తెలియక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 51 ॥

శ్లో॥ ఒనరగా నల్వురు నన్నుజూచి యయ్యో పాపమంచు
ననిపించుకోలేన, బయటి నా వ్యవహార నిష్ఠతయు
ననుగట్టు, పొగరుబోతనియ యనిపించు నా గుండె వ్రయ్య
నిను నెంచుచునుగూడ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 52 ॥

శ్లో॥ నీటికొలంది తామర జగత్తేమి నీవేమి ? భేద
మో టోకుబేరమునీది, చిల్లర యుర్విది, యెంత
టాటోటు బ్రదుకయ్యె నిమ్మనియడుగుటయె చాలు నెంత
నీటు చూపింతురు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 53 ॥

శ్లో॥ నిలచినవాడను నిలచినట్లుగ నీవెల్గు క్రమ్మి
శిలనుగానాయె, బూడిదయుఁ గానాయెను జెందించవంత
వెలుఁగు నాపై, రాతి నెలత జేసితివి, మనుష్య శిలగ
నిలుపంగజాలవో భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 54 ॥

శ్లో॥ ఓయి బాబోయి ! తావెలికి వచ్చుటయును నెంత తేలి
కో యట్లె లోనికి బోవుటంత కాదోయి నా స్వామి !
హ్రీ యేచ ద్వారబంధాల్బిగించి రానీరు దేవతలు
నీ యాజ్ఞ లేకుండ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 55 ॥

శ్లో॥ నీదయ నీదయ నీదయ మరొండునేరను త్రోవ
కాదని జన్మలెత్తింతు చంపెదు కాంతా సుతులను
వే దరిద్రుని రోగిఁజేతు చేసికోవే రమా రమణ !
నీదయ కానిమ్ము భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 56 ॥

శ్లో॥ నా జీఱ యెఱుఁగుదు వీవు రామచంద్రా ! మొండివాడు
రాజుకన్నను బలవంతుఁడు బిగింపు రవ్వంత ఫలము
తేజాల దెందుకు గాని దిగవయ్య దిగు, సంచరన్న
ణీజాలరుచిహాస ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 57 ॥

శ్లో॥ నాది యేమున్నది ప్రతి నిమేషమ్మున న్నేను సిద్ధ
మే, దాని వ్యవహారమేమొ చూచికొమ్మీవు చూచుటకు
లేదందువా ? దానికైన సిద్ధమే లేకపోనిమ్ము
నీదేది కాదందు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 58 ॥

శ్లో॥ నిరపాయ ! నేనేర్చి నన్నిమాటలు నేర్పరెవ్వరును
అరయ నీమాటలు వేనికవి నీక యప్పజెప్పెదను
మరియు దీనికి దొరవోలెఁ గోపము మన్నింతువేని
'నిరవాక' మైనట్లె భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 59 ॥

శ్లో॥ అరులును మిత్రముల్ జరుగవలసిన యపకారమునకుఁ
బొరసెడు నుపకారమునకు సాధనములు దైవమునకు
మఱియు నీ దయలేమి మరియు దయకల్మి నా సాధనములు
నెఱికల్గుఁ గల్గవు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 60 ॥

శ్లో॥ ఆకలి లేకుండ నోటి వాపిరి యన్నది కలదు
ఈ కామ మంతకుమించి చెడ్డది యిందిరాహృదయ !
వేకట్టి పాతిపెట్టుము, చిగుర్చును, వేళ్ళును బారు
నీకంటె మొదటిదో ? భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 61 ॥

శ్లో॥ యోగీశ్వరుల కథల్ విన్నచో నాకు నుల్లాన దిగులు
కాఁగలనా ! యట్టివాడనంచు, నీ కామమ్ము కోసి
యూగి యే పాపమే జన్మ మెత్తించునో ఆగవే ! ధు
నీగంధి కరుణాక ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 62 ॥

శ్లో॥ చివరకు వెనుకటి జన్మకూడఁ దెలియని జీవుఁడైపోతి
నవుర ! నేనీ జన్మదాక నఘహీనమైనట్టి జన్మ
మవు నెత్త లేదన్నమాట, యెత్తింపుమయ్య యింకైన
నివిడిన జాలితో భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 63 ॥

శ్లో॥ నవ్వుచుఁ బాపపు మాటలాడెద, నా జీవునందుఁ
బవ్వళించిన యట్టి కామ భావనోల్బణములు కావొ ?
నవ్వులై పరిసిపోయెడిని కవనంపు నాయంకరమున
నెవ్వగ యెదపొంది భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 64 ॥

శ్లో॥ ఈ లోకపుందెల్వి పొంగులైనట్టు లిచ్చితి స్వామి !
నాలుక తుదఁ జమత్కృత సరస్వతీ నాట్య రేఖగను,
మేలుకావచ్చును కవికి, జన్మయు మృతియు మాటేమి
నీలాంబుధర దేహ ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 65 ॥

శ్లో॥ చదువవేసిన యంత నున్న మతికూడ సమసిపోయెనన
మొదలిగి నీ మర్వుచొరగ, మున్నున్న పోడిమి కూడఁ
జెదిరిపోఁ జిత్తంబు చెదరిపో నాశ చెదరిపో స్పృహలు
నిదురపోనీవాయె భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 66 ॥

శ్లో॥ సంచిత పాపమ్ము లెట్టివో స్వామి ! సంసార బుద్ధి
మంచినీటికి నెక్కునట్టిదగు చేపమాదిరి గాగఁ
బంచుచున్నది యూహ, నీదు మృదుపాద పారిజాతమ్ము
నించునా చిఱుతావి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 67 ॥

శ్లో॥ పోరియుఁ బోరి యీ మనసు వంకర, పురుష యత్నమునఁ
దీరికయున్నది, దైవయత్నానఁ దీరగావలయు
తోరముగాగ మీ కాళ్ళ వ్రేళ్ళయందునఁ బడుచుంటి
నేరకయేకదా భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 68 ॥

శ్లో॥ నన్నేమి చావుమంచనెదొ ? యెంత యత్నము చేసి మనసు
నిన్నంటుకొని నిమేషమ్మయినగాని నిల్చుటలేదు
నన్నొక్క వేయి జన్మలను గత్తుల నరకుము విడక
నిన్నంటుకొనియుండ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 69 ॥

శ్లో॥ ఇంతగా మనసు నీపైని నిల్వని యీ జన్మకంటె
వింతయౌ పశుజన్మ చాల మేలనిపించునో స్వామి !
కొంతయఘ మనుభవించు, నంతియ, క్రొత్తపాపము గు
ణింతముల్‌నేరదు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 70 ॥

శ్లో॥ అల కామరోగమ్ము గొంగదియు మానినట్లుగా మాని
సెలవేయు, రెట్టింపు తీపు, నెత్తురు చీము పట్టీలు
తొలిగూడు నీ కృపా రసము పూతలఁ దీరును గాక
నిలువనీయదు జీవి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 71 ॥

శ్లో॥ జ్యోతివోలిక నీవు కనుబొమల మధ్య నుదయించువేళ
నీ తనూయష్టిలో గాలి యాగిపొయెడు రమా రమణ !
చేతమ్ము స్తంభించుచుండెఁ బ్రాణమ్ము చేతమ్ము జంట
నీతమ్ము లొకసారి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 72 ॥

శ్లో॥ కాఱించుచుంటివి మనసు దినదిన గండంబు మరియు
నూరేండ్లు లాయుస్సుగాగ బ్రదుకిదెందుకు బిట్టు భార
మౌరీతి ? నేటికి సుఖములు ? సుఖంబులని రమించుటయు
నేరని కాడికి ? భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 73 ॥

శ్లో॥ లేరు మాదృశు లుర్వి, సుఖము లక్కఱలేదు, దుఃఖంబు
లోరువజాలను, బ్రదికియుండుట యుర్విపై బరువు
నౌర ! నీ కృప లేదు, తెలియరాదు జన్మాంతర ఫలము
నీరీతి తెలియదు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 74 ॥

శ్లో॥ చేసినవానికిఁ దప్పుకున్నచోఁ జేయుము నరక
వాసమ్ము, పుణ్యానుభూతి యేమియు వలదులే, నరక
వాసాన వైరాగ్య మతియు నీదైన భక్తియు సాగ
నీ ! సర్వ రక్షకా ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 75 ॥

శ్లో॥ సొరిది నీ యున్నగోడు చెడకుండగఁ జూచినఁజాలు
పెరుగ నక్కఱలేదు. లేద యాశ నన్ బీడించుటయును
మరణమ్ము ప్రభు ! నిరాయాసముగఁజేత మన్నించు చాలు
నెఱసుల నెన్నక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 76 ॥

శ్లో॥ ఇటనెదో విధముగా సాగుచున్నదింకేమి వైరాగ్య
పటువచో గత విడంబనము చేయగా వచ్చునంచీవు
వెటకారముం జేసెదేని కాదన్న విధమౌను కాదు
నిటలాక్ష హితతమా ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 77 ॥

శ్లో॥ ఒక మాటమాత్రము నికరమౌ మాట యుర్విజానాథ !
త్రికరణశుద్ధిగా ననెడు మాటయే తెచ్చినదైన
సుకమింక నొక జన్మతోడఁ గోరను నువ్వె నీద గు వ
నికి పోకపై నొట్టు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 78 ॥

శ్లో॥ ఉన్నచో మొదటి నుండియును నీ తెల్వి యుండగావలయు
సన్నగా నడుమను గల్గెనేనియుఁ జచ్చిన చావె
పన్నిన బ్రదుకు గోచికిని బెద్ద గావంచాకు చిన్న
నిన్నెంచు చెన్నక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 79 ॥

శ్లో॥ ఉండియుండి యితండు గొడవ పెంచుచు నున్నాఁడటంచుఁ
బండబారని కాయకొఱకు నిరుకునబడకు నా స్వామి !
పండబారిన నాటిమాట చూచుకోవచ్చు నాయెడద
నిండియుండుము చాలు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 80 ॥

శ్లో॥ ముడిదినుసు నిజంబు నా యెడద, యంబుజ పరీమళము
వడబోయు నీ కాలి దుమ్ముతో నూరిభావన చేసి
వడి దీనజన రక్షణంబనెడి యనుపానంబుతోఁ ది
నెడి యోర్పు చూపవే భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 81 ॥

శ్లో॥ అన్ని వ్యాధులు మశూచికముతోఁ బోవు నని, మృతితోడ
నన్నియు నింకన్నిపోవు, మృత్యువు నాడెదరేలొ ?
ఉన్న, మృత్యువుకంటె మిత్రమున్నదే, యున్నన్నినాళ్ళు
నిన్నెంచుచున్నచో భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 82 ॥

శ్లో॥ ఏమియు లేనిదానిని గురించి యిదెల్ల నున్నదని
యీ మానవులచేత నిత్యమనిపింతు, వెంతటి మాయ
స్వామి ! నీవే యెన్నోసార్లు ధాత్రిపై జన్మించితి, వల
నీమేను లేమయ్యె ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 83 ॥

శ్లో॥ కావలమైనట్టి జనముచేత లోకంబున సజ్జ
నావళి యిడియుట లోకవృత్తంబు నందిది సగము
నీ వోడుట సగంబు, సజ్జనావళి నీ వౌటచేత
నీ వాడుట సగంబు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 84 ॥

శ్లో॥ ప్రభువును నమ్మినందులకుఁ దెలిపిని బడవేసినావు
సభయుని నభయుని జేసినా, వింక జన్మలమాట ?
యుభయుల మున్నామ, యెత్తుమన్నచో 'ఊఁ' నీలమేఘ
నిభమోహన శరీర ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 85 ॥

శ్లో॥ మండిపోవుచునుంటి గోపమూని కామమ్ముచేఁ బెరిగి
గండివడుచునుంటి సిగ్గుబదు లహంకారమ్ము పూని
యుండియుండి యిదేమొ బోర్లపడి పోవుచున్నాను నేను
నిండుకుండవు నీవు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 86 ॥

శ్లో॥ స్వామి ! యీ కామగుణంబహో ! జన్మజన్మాంతరాల
నే మొట్టమొదటనో ప్రథమ చైతన్య పృషదంకురమున
వ్యామిశ్రమైనదో ! వదలరాకుండె, అది కరగింపు
నీ మేల్మి యరుదేర భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 87 ॥

శ్లో॥ ఖగవాహ ! మాటలు నేర్చినట్టి కుక్కను వెంటగొంచు
నొగి వేటకేగ నుజ్జోయన్న నుజ్జో యన్నదంట
నిగమాంత వాక్యముల్నేర్చి యనుభూతినేరని వాక్య
నిగళంబు లిట్లుండు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 88 ॥

శ్లో॥ అచ్చమైన సుఖంబు మొదటిదిను సేది యర్థించి సృష్టి
తెచ్చితో ? బాధలర్థించి దుఃఖమర్థించి తెచ్చితివా ?
క్రొచ్చిన మతితోడఁ దద్దినమె వందుకొని తెచ్చుకొనును
నిచ్చ లుడుగనిది భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 89 ॥

శ్లో॥ చేసెడునట్టి పాపములె వదలక చేయుచు, నిన్ను
జేసెడునట్టి ప్రార్థనయు వదలక చేయుచు నున్న
యీ సంధిలో నున్నయట్టి మానవుఁడేమౌనొ సురధు
నీ సంగి చరణాబ్జ ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 90 ॥

శ్లో॥ పంతంబుగొని నేను కష్టపెట్టుకోవలె గాని దాని
యంతట నది కష్టపడదు నాయెద హరి ! నినుదలచి
అంతటిదగు బలవంతపున్ బ్రాహ్మణార్థంబు పరిగ
ణింతువో నీయెద ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 91 ॥

శ్లో॥ నిన్నుదలంచుటయన్న భావముల్ నెగడుటకాదె
పన్నిన మధ్యాక్కఅలుగ భావముల్ వచ్చెడు స్వామి !
యెన్న నీ కవనంబు లేకయున్న నేనేమయి యుందు
నిన్నెన్నజాలక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 92 ॥

శ్లో॥ మఱుజన్మ మాట యెందులకు ? తెలియదు మఱునిమేషమ్ము
జరిగెడు నీ సృష్టియేలొ తెలియదు స్వామి ! నీ రూప
మెఱుగను, భావముల్ వచ్చుటాడుట యెఱుగుదును, నెంత
నిరుపాయమౌ స్థితి భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 93 ॥

శ్లో॥ కూడి పూర్వ మహర్షులన్నదానిపై గ్రుడ్డి నమ్మకము
వాడి తదక్తు లర్థమ్మునందు లవం బనుభూతి
యాడని గుండెతో నేనుగాని గ్రీష్మాకృతి నైతి
నీడ నోటెఱుఁగక భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 94 ॥

శ్లో॥ చెవులు చిల్లులు పడిపోవు, గుండియ చిట్టెము కట్టు,
నవని నన్యాయముల్ వినుచు స్వయముగా ననుభవించుచును,
నవుర ! యీ యొక జన్మచాలు మరియు నేలయ్య జన్మములు
నివసద్రమా వక్ష ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 95 ॥

శ్లో॥ ఇక జన్మయని వద్దు స్వామి ! యన్నట్టు లెత్తించినావు
ఇక జన్మవద్దు నా స్వామి ! యెత్తించితేని యెత్తించు
మొకరి సంచిత మున్నదందువా ! సరే ! మొద్దుపై వర్ష
నికరంబు కురిపించు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 96 ॥

శ్లో॥ ఒక నిప్పుకణము నీ నుండి చెదరించి, యొప్పించి, నివురు
సెకమిలి కప్పించి, మరియు దీనిని జీవుఁడన్ పేరు
నకు బాల్వరచి, నన్ను నన్నుగాకుండ నా తెల్విలే కు
నికి చేసిరెవ్వరు ? భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 97 ॥

శ్లో॥ అట్టె మాటాడినఁ గర్మ కర్మయంచాడెదు, నీవు
ముట్టించవచ్చును, లేదయేని నే ముట్టించఁగలను
వట్టి నన్నూదిపెట్టుము రవంత కప్పదు నిన్ను నివురు
నిట్ట జాలింజూడ భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 98 ॥

శ్లో॥ నీ మంత్రము మహర్షులకును లో నుండి నిర్గమించినది
స్వామి ! నాకో వెలినుండి యాత్మ లోపలికెక్కవలయు
స్వామి ! యీ మంత్రము నీది, కాదన్నవాఁడెవ్వడు ? నను
నీ మంత్రమున నిల్పు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 99 ॥

శ్లో॥ నిన్నార్తిచేత నిట్లడుగుచుంటి గానీ లేకయున్న
వన్నెలు చిన్నెలు గాగ వర్ణింప వలతిని నేను
నన్నెఱుంగుదు గావె ! మరల రామాయణమ్మంత చేతు
నిన్నుఁ గష్టముకాదు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 100 ॥

శ్లో॥ శ్రీరామచంద్ర ! యస్మద్ హృదురు వియ త్ప్రియతమ చంద్ర !
సారోపనిషదర్థ భూత ! ముక్తియోషామణిక్రీత !
నీరధి భంగ ! భూమీసుతా మనో నీరజభృంగ !
నీరధర శ్యామ ! భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ ! ॥ 101 ॥



#  సమక్ష రాఘవము 

*( భద్రాద్రి రామునితో ఫలిత వాదం )*

- కొండపల్లి రామచంద్రరావుగారు

1. శ్రీకర ! పంకజాక్ష !  అతసీసుమసన్నిభ ! చారువిగ్రహా !
ఓ కమలాప్తవంశమణి ! ఓ జగదేకధనుష్మదగ్రణీ !
ఓ కమనీయ నిత్య విభవోజ్జ్వల ! భద్ర ధరాధరేశ్వరా !
నా కవలోక దైన్య దమనం బొనరింపగరమ్ము రాఘవా !

2. లోకమునందు భక్తజనలోకము నీదగు రక్షణక్రియా
లోకనలోనిదన్న నుడిలోగల సత్యమునమ్మికాదె ము
ల్లోకము నిన్ భజించు, నవలోకము నాకిటు మాన్చి తేలనో
నాకవలోక దైన్యదమనం బొనరింపగరమ్ము రాఘవా.

3. చీకును జింత లేక నివసించుచు నెమ్మది నీ పదాబ్జ రే
ఖా కృతులం దలంచుచు శుభావహ తావక దివ్య గీతికా
నీకములం బఠించెదు వినిశ్చితు నన్నొక చీకు జేసెదే
నాకవలోక దైన్య దమనం బొనరింపగరమ్ము రాఘవా.

4. నందకుమార ! కేశవ ! జనార్ధన ! మాధవ! వాసుదేవ ! గో
విందా! యుపేంద్ర! కృష్ణ! హరి! విష్ణు! త్రివిక్రమ! పద్మనాభ! సం
క్రందన ! పూరుషోత్తమ ! జగత్ప్రభు ! శ్రీధర ! నారసింహ ! నా
వందన మందికొమ్ము మధువైరి ! దృగుజ్వల మిమ్ము రాఘవా !

5. అడుగన్నేరకయున్న నమ్మయును దా నన్నంబు వెట్టంగ బో
దడుగం బూనితి కొంగు జాపికొని, నా ప్రారబ్ధముల్ మాన్పి నే
డిడుమావీక్షణ పూర్ణశక్తి కొనుమా హృత్పూర్వవాక్పూజనం
బడుగుం దమ్ముల వ్రాల్తు నౌదలను దేవా ! కావవా రాఘవా !

6. సన్నుతి సేయబూనిన పసందగు మాటలు చాలినన్ని నా
కున్నవిగావు, రూప మెటనోగని తృప్తి వహింతునన్న లే
కున్నవిగాదె చూపు, లెదనుంచి స్మరించుట మాత్రమొప్పె, నే
మున్నది నాకు ? లోకమిక, నొప్పిరికింపకుమయ్య రాఘవా !

7. వాలాయంబుగ నిన్ను గొల్చితిగదా పద్యాల్గు వర్షాలు, నే
నీలాగై చరియింప సద్యశము నీ కేలాగు వర్ధిల్లు న
య్యా ! లావణ్య కుమార, నా మనవి నీ కందంగ లేదో కదా
ఏలా నీదయరాదు చూపొసగి రక్షింపంగదే రాఘవా.

8. పైసాపై సకు నాస పుట్టినద ? నాపై సామి నీ సత్కృపా
భ్యాసంబుల్ కొఱవడ్డవేమొ సమయ వ్యాప్తంబు లిట్లుండెనే
మో, సాదృశ్యములేల, మ్రొక్కులనికన్ మ్రొక్కించితీర్పించుకొ
మ్మీ సంపత్తులునీవి దిద్దికొని చూపిప్పింపవా రాఘవా.

9. నీ సౌందర్యము, నీ కటాక్షమును, నీనిర్వ్యాజభక్తౌఘ ర
క్షా సామర్థ్యము నీ ప్రతాపమును నీ సౌభ్రాత్రమున్ నిత్య సీ
తా సానాధ్యము నేనెఱుంగనివె ? నిందల్మోప నాకేటి జి
హ్వా చాపల్యము ? చూపుకక్కురితి యిట్లాడించెడిన్ రాఘవా.

10. నీ వాడన్ రఘురామచంద్ర యనుచున్ నేనుండ సీతాపతీ,
మావాడేయని నీవుకూడ ననుకొమ్మాచాలు చాల్పాలు, నా
కేవాడున్ సరిపోలలేడు హనుమన్నే తోకపై కెత్తి నీ  పై విన్పించును
సన్నుతుల్ కనుల జూపందింపవా రాఘవా !

11. నిటలన్యస్త కరాంజలుండనయి నిన్నే నమ్ముకొన్నట్టి, న
న్నెటు రక్షింప దలంచుచుంటివొకదా ఎన్నాళ్లుగాసైచియుం
డుటనాకున్ విధియించినావు, కనులందున్ మాంద్యమేపారినన్
త్రుటియేనొక్క మహా యుగాతిశయమైతోచుంగదా రాఘవా.

12. లోకాలందున నున్నయట్టి జనులాలోకింప, దత్తద్వ్యధా
నీకంబుం బరిమార్ప నేర్పరివి, నేనే భారమై యుంటినా
నీకున్, నాకనులీయనేరక జగన్నిర్మాత వెట్లొదువో
నాకుం దోచదు,నీవె తెల్పవలె నా న్యాయంబులన్ రాఘవా.

13. వినతిం జేసితి బెక్కు మార్లు నిను నా విజ్ఞప్తు లొక్కొక్క టే
విని సాఫల్యము నొందజేసితి వి దేవిద్దారమోకా, వచిం
పను నూహింప నశక్యమై పెడచెవింబట్టించి నావీమొఱన్,
కనులందుంగల దోసమున్ దులిచి చక్కంజేయుమా రాఘవా.

15. చేసితి పెక్కు దోసములు చేసితి ఘోరతరాపరాధముల్
చేసిన యెగ్గులెన్ని నిరసించిన వచ్చునదేమినీకు, నే
చేసిన సంస్తవంబులకు చేయని పున్నెము లొప్పవెట్లు, నీ
వాసికి వన్నె తెచ్చు కొనవా కనులీయగ రావ రాఘవా.

16. నరలోకానికి చక్షురింద్రియము సింగారంబెయౌగా, నన
శ్వరమున్ నిత్యము సత్యమాద్యము పరబ్రహ్మన్ గనన్నేర్చునే
వరదా ! తద్గత దోషముం దులిపి దీవ్యత్తేజమందిమ్ము, ని
న్నరయంజాలుదు నానిమేషమునకై యర్థించెదన్ రాఘవా.

17. లావొక్కింతయు లేక యుండుదనుకన్ లాలింపవా వెన్క నెం తే
విభ్రాంతిగ దత్తరం పడెదవున్ నీ భక్తులన్ రిక్తులం
గావింపం దమిగొందు క్షిప్రదుడనంతశ్రీదుడన్ పేరు లే
లావర్తిల్లెను నీకు, చిత్రమిది చూపందీయవా ! రాఘవా !

18. బంగరుమేల్ జరీపనుల వస్త్రములెన్నొ యలంకరించు టొ
ప్పంగనుగొంటి నబ్రమగు వాహనముల్గొని రాచఠీవి యు
ప్పొంగ జరింప గంటి నిను మున్నటు సార్థకమై రహించు క
న్నుంగవ నేడు వ్యర్థమగు న్యూనత నొందగనీకు రాఘవా !

19. చేరగనీయరాని నను జేరిచికొంటివదేల ? ముందుగన్
దూరముగా నొనర్చి పలుదూరులు వెట్టగనేల నిప్పు, డీ
మేరకు నాద్యనిష్ఠురమె మేలయియుండగ నంత్య నిష్ఠురం
బీరహి నొందనేమిటికి ? ఇమ్ముగ నా కనులిమ్ము రాఘవా.

20. వారక నీ గృహాంతర నవన్నవదీప్తులలోని మంచిక
ర్పూరపు వాసనల్ గనుల ముక్కుల దాకిన నెల్ల రోగముల్
దూరములై జరామరణ దుస్థితులంటక పోవునంద్రు, వి
డ్డూరము వచ్చెనాదెస నిటుల్ కనులీయగ రావ రాఘవా.

21. రాచిన రావుచాలు నికరమ్ము కరమ్ముసుకమ్ము నిమ్ము నీ
వేచిన ప్రేమ భక్త తతి నేలెడు వాడనిపించుకొమ్ము నీ
వీ చినకార్యమున్ ఫలసమృద్ధ మొనర్పజాలవేని పో
నీ చెడ నేను, పేరు చెడు నీకు, సువీక్షణ మిమ్ము రాఘవా.

22. వాగుదురెందరోకవులు వారి వచోగతికేమిలెక్క నే
నేగతి నాడిపాడిన లభించిన కీరితి కేమిలోటు బా
గ్బాగని యెంచబో కెవరివాక్కెటువంటిదొ చెప్ప శక్యమే
సాగునె అన్ని రోజు లొక చక్కిని వీక్షణమిమ్ము రాఘవా.

23. అవ్యయమైన దోసముల నన్నిట నెన్నటికైనగాని మం
తవ్యము నీదికాదె భరితవ్యథ బాల్పడనీయకుండ క్షం
తవ్యుడ నేను నీకు, సుజన ప్రతతుల్ విని మోదమంద సం
స్తవ్యుడవీవు నాకు, కనుదమ్ముల నిమ్ముగనిమ్ము రాఘవా.

24. నమ్మగలేనివారి నటు నమ్మని యట్టులె యుండనిమ్ము నీ
నమ్మిన వారికైన నొకన్యాయము సేకుర సేయకుండినన్
నమ్ము నెవండునిన్ను ? భజనమ్మెటుసాగు ? దలంచుకొన్నచో
గ్రమ్ము భయమ్ము నామదిని రమ్ము సువీక్షణమిమ్ము రాఘవా.

25. పోడిమి నెందరెందరొ గుముల్గొనితోచియు తోచకెవ్వియో
వేడుచు వత్తురే విసిగి వేసట నొందితినిద్రలేదు మా
రాడకు పొమ్ము పొమ్మనిన యంతనెపోదునె ? చూరుపట్టి వ్రే
లాడెదగాక చూపొసగి హాయిగ నిద్దురపొమ్ము రాఘవా.

26. వెదుకగనేల ? నా హృదయ వీధినె యుందువు కన్నులీవ క
న్ను దెరచు ఔప్పులీవకద, నోరును మాటయు నర్థమీవ, నే
నెది విరచింతునయ్యది గ్రహించి యనుగ్రహపాత్రుజేసి యే
లు దొరవు నీవకావ కనులోపము పాపగరావ ! రాఘవా.

27. చేసితివౌ సుచేలుని / కుచేలుని నొక్కని వింటి వింటి నే
దీ సరిక్రొత్త నేర్పున కుదృక్కుని నను సుదృక్కుఁ జేయుమా
నీ సరిదైవ మెచ్చుటను నేటికి లేడికనుండడన్న నీ
వాసి బహుప్రచారముల వర్ధిల్లు చుండును దేవ ! రాఘవా.

28. నీవుం గాదనలేవు నేనయిన నిన్ వీడంగలే నిట్టులే
పోవుంగాలము పోదురెందరొ శుభంబుల్ నీకు వాక్రుచ్చుచున్
నీవిప్పట్ల నజామిళుల్ దశశతానీకం బనేకంబులం
గావన్గీరితి మొక్కవోవదు, కనుల్ గాన్పింపవా రాఘవా !

29. కోరన్ లేదుగదయ్య యెన్నడునినుం గొంతెమ్మ కోర్కెల్ 'నమ
శ్శ్రీరామ శ్రియమేవదేహి' యని, శారీరార్తి వాటిల్లినన్
నీరోగుం బొనరింపుమంటి, కడకంటిం గంటినిమ్మంటి, మే
లారం గంచెయె చేయుమేయునొకొ,చూపందీయవా రాఘవా.

30. ఓవిశ్వాధికతేజ ! ఓ గుణనిధీ ! ఓ భక్త కల్పద్రుమా
ఠీవిన్ సృష్టియొనర్ప పుష్టినిడ నష్టింగూర్ప నిస్తుల్యమౌ
ప్రావీణ్యంబును గన్న దొడ్డ దొరవై పాలింతు వీలోకముల్
నావైపుం గరుణించి చూపు నొసగంగా చూడవా రాఘవా.

31. పొగడుకొలంది పైపయికి బోదువుపో, దిగివచ్చి "యెందుకీ
వగ"యని ప్రశ్న సేయవు "శుభంబగుతొందర యేల?" మంచి చె
డ్డ గలిగెడుం దొలంగెడు హఠాత్తుగ రాదునుపోదు" నంచు నె
మ్మిగదురబల్క వేమియును, మేలుగ చూపులనిమ్ము రాఘవా.

32. చెప్పిన మాటలే మరల జెప్పెద వేసినయట్టి ప్రశ్న లే
గుప్పుచునుందు, నే నడిగికొన్నది నీ విడునట్టి దొక్కడై
చొప్పడుదాక నిన్ విడువ జూడను, వేడబమేల ? వచ్చి నీ
విప్పుడు చూపు నిచ్చి విడిపించు కొనందగుదీవ రాఘవా.

33. సిరికిం జెప్పుము శంఖ చక్రయుగముం జేదోయి సంధింపు, మే
త్వరయున్ లేదు, సమస్త వైభవము లందంబొప్ప వేంచేసి, కం
టి రుచుల్ నిండ నొసంగి వేగజనుమీ నీకోసమైయుందు రెం
దరొ మిన్నందు మహానుభావులు కృతార్థ స్వాంతులై రాఘవా.

34. క్షీరాబ్ధిన్ శయనించి యుందువు కదా ! శేషాహితల్పంబుపై
ధారావాహినిగా సుపర్వమునిచంద్రస్తోమ మగ్గింపగా
స్మేరాంకూరము భక్త శోభనముగా, చింతాకులుంజేసి, నన్
వేరుంజేయకు, చూపొసంగి కరుణన్ వీక్షింపవా రాఘవా.

35. సొగసంతాకన దిష్టి సోకి చెడునంచున్ దోచెనోయేమొ, నీ
నగుమోముంగనలేని నా హృదయ దైన్యంబున్ విలోకింప, వీ
యగచాట్లింతగ నేలపెట్టెదవొ యన్యాయంబుగా నన్ను, క
న్నుగనం జెన్నుగనిచ్చి మెచ్చుగొని సంతోషింపవా రాఘవా.

36. పురుషులకైన మోహమును పుట్టగ జేసెడు నందగాడ వం
చరసి వచించినారు మునులప్పుడు గల్లనిలోటు నేటి క
చ్చెరువుగ నెట్లువచ్చు పరిశీలనలో నిపుణుండవీవ, యే
వెరవు ఘటింప జూచెదవొవీక్షణ మీక్షణ మిమ్ము రాఘవా.

37. నిను వినుతించుచుండ నను నెమ్మిగనమ్మినవారలందు రీ
వెనుకటి మూఢనమ్మకపు వింతలు చాలును, రాముడీయనే
ర్చునె కనులంచు, మొన్నకద చూచితిమంధుడు చూడనేర్చె భ
ద్రనగమునందు నిన్గొలిచి, తప్పిన చూపుల నీవ రాఘవా.

38. అరయున్ నేనొక నీరసాక్షుడను, నీవా సారసాక్షుండవ
క్షర సామ్యంబుననయ్యె సన్నిహితమోస్వామీ ! భవాత్పాద కిం
కరుడన్ ప్రాణమొకండొసంగి మలి ప్రాణమ్మొంచుకొమ్మీవ, నే
సరసాక్షుండుగనయ్యెదన్ వివిధ సంస్తవ్యుండవో రాఘవా.

39. నినుగని కేల్గవన్ మొగిచి నీ పదదాసుడనన్న మాత్రమే
ల్కని మును పెందరెందరికొలాఘవముల్ దొలగించినావులే,
అనితరబుద్ధి నే బిలిచినప్పుడె తప్పర ఔప్పవ్రాలెనో
మునుకొని వీక్షణంబొసగి మున్పటి వాడవుగమ్ము రాఘవా.

40. దాతవు తల్లిదండ్రివి యుదాత్త గురుండవు చక్రవర్తివిన్
జ్ఞాతపు నీళ్ళకంటె పలుచందన మేర్పడనన్ను జూచినన్
లాతులె యొదురెల్లరు వలంతు లలంతిగ జూడ బూనినన్
నా తరమే భరింప నయనస్ఫుటపాటవమిమ్ము రాఘవా.

41. దానవనేత సోమకుడు ధాతను కన్ను మొఱింగి వేదముల్
మానుగ ముచ్చిలించి గరిమంబున నంబుధిలోన దాగినన్
వానివధించి వేదముల వారిజసూతి కొసంగినట్టి పెన్
మీనమమైన దేవుడవు మేలగు చూపుల నిమ్ము రాఘవా.

42. కూర్మిమోయి౯ సురాసురుల గూడి సుధాబ్ధిని మందరాద్రిచే
నోర్మి ఫణీంద్ర రజ్జువున నూపి మధింప నగం బడంగుచో
శర్మముగూర్ప పెన్కుదురు చాడ్పున నగ్గిరి భారమోర్వగా
కూర్మమవైన దేవుడవు గొబ్బున వీక్షణ మిమ్ము రాఘవా.

43. వీక్షణ దుర్నిరీక్ష్యముగ పృధ్విని జాపగచుట్టి యా హిర
ణ్యాక్షుడు వారిధింజొరగ నాతని జంపితి, వొక్క కొమ్ముపై
నీ క్షితిబంతి పోలిక ధరించి చరా చర భారమోర్చు ప్ర
త్యక్ష వరాహ దేవుడవు తక్షణ వీక్షణ మిమ్ము రాఘవా.

44. పటుతరయుక్తి శ్రీ శునిట బాలక ! చూపుము చూపకున్న ని
చ్చటబొలియింతునంచు పెలుచందన వాలున నుక్కుకంబము
త్కటముగ వ్రేయ నా కనకకశ్యపు ప్రేవుల జీల్చి వైచు ను
ద్భట నరసింహ దేవుడవు బాగుగ చూపులనిమ్ము రాఘవా.

45. అడుగులు రెంట భూగగన మంతయు గొల్చితి జూపలేవనో
కడమ పదంబునన్న బలి గ్రచ్చర శీర్షము జూపినంత, నొ
క్కడుగున గ్రుంగనొత్తి త్రిదశాధిపతిత్వము వజ్రిచేతిలో
నిడువటు డైన దేవుడవు, ఈ క్షణ మీ క్షణమిమ్ము రాఘవా.

46. సర్వనృపాటవీక్షయము సల్పెదనంచు పరశ్వధంబుచే
నిర్వది యొక్క మారు లవనీశుల కుత్తుక లుత్తరించ, నొ
క్కడుగున గ్రుంగనొత్తి త్రిదశాధిపతిత్వము వజ్రిచేతిలో
నిడువటు డైనదేవుడవు, ఈక్షణ మీక్షణమిమ్ము రాఘవా.

47. రవికుల రాజవై జనకరాజ సుతన్ వరియించి తండ్రి యా
జ్ఞ వనుల కేగి తాపసుల సత్కృతులంగొని సీత గోలుపో
యి వనధిగట్టి లంకజని యెల్లసురారుల నుక్కడంచు దే
వవినుత సార్వభౌముడవు బాగుగ చూపులనిమ్ము రాఘవా.

48. మురళి రవంబునన్ బసుల ముద్దియలం గరగించు కృష్ణుడు
ర్వర ననుజుండునై మొఱటు రక్కసులం బరిమార్ప, హస్తినా
పురమును పెల్లగింప హలముంగొను నా బలరామమూర్తివై
వరలినయట్టి దేవుడవు వారక చూపుల నిమ్ము రాఘవా.

49. త్రిపుర వధూటికాగణ వరిష్ఠుడవై చెలువొంది భీషణ
త్రిపుర సురారి దాహక విధిత్వరుడౌ హరునిన్ శరాసబా
ణపటురథాది సాధను నొనర్చి జగన్నుతి గన్నయట్టి ని
స్త్రపుడగు బుద్ధ దేవుడవు తప్పక వీక్షణ మిమ్ము రాఘవా.

50. హద్దును పద్దు లేక కుజనావళి పాపములం బొనర్చుచో
జిద్దుగ వాలుడాలుగొని చెన్నుగ సైంధవమెక్కి వారలం
దద్దయు నొంచి సజ్జనుల వారి సరాసరి సేయనున్న చం
చద్దశ కల్కి వౌదువట చయ్యన చూపుల నిమ్ము రాఘవా.

51. ఆరును ప్రక్కనారు గలయట్టిసమల్ సమకూరునా వయో
భారములోన పుష్టిగల భాగము నీపదసేవనా పరీ
వారములోన శిష్టగతి వర్తిలె, దాని తలంపలేరొ శ్రీ
వారొకమారు, పేర్మిదయివారగ వీక్షణ మిమ్ము రాఘవా.

52. చీకటికప్పు కప్పులిడు చెల్వుడవౌ నిను కన్నులున్న వా
రే కనలేరు, నాకరయుటెట్టులగున్ దరహాస చంద్రికల్
పైకొన జేయు దేని గనుపట్టు పదంబులు నెమ్మొగంబునున్
నాకవలోకదైన్య దమనం బొనరింపగరమ్ము రాఘవా.

53. వాకున కందరాని నిరవద్య గుణుండవటంచు వేదముల్
వాకొను నిన్ను గూరిచి యవాకుచవాకులుపల్క జొచ్చినన్
జేకొని మెత్తురే బుధులు, చేకొనుమయ్య సవత్సలుండవై
నాకవలోకదైన్య దమనం బొనరింపగ రమ్ము రాఘవా.

54. స్వీకృత లోక పాలన విశేష చమత్కృతి మత్కృతీశ్వరా !
ఆకొనువారి కన్నమిడు నంబుజనాభ, ఘనా ఘనాభ, య
స్తోక భవత్పదాబ్జముల జొక్కుచు దండమువోలె వ్రాలితిన్
నాకవలోకదైన్య దమనం బొనరింపగ రమ్ము రాఘవా.

55. జయ జయ సార్వభౌమ సుత, సర్వ దిగంత యశోభిశోభితా
జయ జయ పాపమోచన, విశాల సితాంబుజ పత్రలోచనా
జయ జయ శ్రీకరా, జనకజా హృదయాంబుజ బాలభాస్కరా
జయ జయ రామచంద్ర ! అగజానుత భద్రగిరీశ రాఘవా.

56. ఇంతటి వేడికోలును ముగించి ధరాభరమట్ల 'నా భర
మ్మంతయు నీదె జు'మ్మని జయమ్మును బాడి కలమ్మునాపి నీ
చింతనలోన నుండ, వివశీకృత చిత్తుని జేసె నీదయా
స్వాంతము నన్ను నెంతటి మహామహితాత్ముడవయ్య రాఘవా.

57. అలనాడంధుడొకండు స్వప్నగత వృత్తాంత మ్మెడన్ నమ్మి ని
ర్మల భక్తిన్ నిను జేరవచ్చి మది సంప్రార్థించి గోదావరీ
జల సుస్నాతుడునైన వెంటనె మహాశ్చర్యంబుతో వచ్చె జూ
పులు విచ్చెం గనులంచు గేకలిడడే మోదంబునన్ రాఘవా.

58. కలగంటిన్ గలలోన నిర్వురుని నే గన్గొంటి మేజాల ముం
గల గూర్చుండి గవాక్షమూదినిలుచున్నన్ నన్ను రప్పించుకొం
చల కార్పాసమునెత్తి మొత్తి 'సరి యేలా వారి బుత్తేర' నం
చెలమిన్ బంగరుశీల త్రుంచి యిడగా నే మ్రింగితిన్ రాఘవా.

59. నా రక్తంబున రామ నామము వినంగా లేకయో వీడు శ్రీ
వారిం జూడ ననర్హుడంచు బ్రభు బిల్వం బంపరైరక్కటా
దూరంబేగెను భాగ్యమేగె రుజయుం దూరంబుగా,చింతయున్
స్మేరాంకూరము పొత్తు జేసినవి నా నెమ్మోమునన్ రాఘవా.

60. నలువుగ రోగవేగము నణంపగపైడిమరం బిగించరో,
చెలువుగ నొక్కతున్క నవశిష్ట మొనర్చి ద్వితీయ చక్షురు
జ్వలకరణ క్రియావసర వైఖరి నూహయొనర్చి డాచిరో
బళి, మరువంగ జూలుదునె, బంగరు శీల మెరుంగు రాఘవా.

61. కన్నులు రెండువోలె నొడికమ్ముగ రాఘవ వేంకటేశ్వరుల్
చిన్నతనమ్మునుండి యెడసేయక ప్రోచుచునున్న దేవు లీ
తెన్నున భక్తులిద్దరి విధించిరొ నావెత దీర్ప, చిక్కునా
కున్నది కంటనైన కడుపొత్తిరి, చిత్ర మిదేమొ రాఘవా.

62. మధు విధ్వంసకుడైన మాధవు దయామాన్యస్థితింగాక వై
ద్యధురుల్ మాన్పగజాలువారలె మధూద్యద్దర్పమున్, నీకృపా
విధమేపారగ నన్నియుం గడచి నిర్విఘ్నంబుగా వీక్షణ
స్వధనం బొందితి సర్వతోముఖయశః ప్రాదుర్భవా రాఘవా.

63. గంపెడునాసపుట్టె మెయిగల్గు దశేంద్రియరోగముల్ నివా
రింపనువెజ్జవంచు బ్రకటించిన గోపననెంచి తద్వచ
స్సంపుటికీవు నిల్పితివి సాక్షిగ నన్నిటనేడు చూపుదో
సంపు బెడందబాపి, బుధసత్తముతాదలలూప, రాఘవా.

64. నల్లని కాళరాత్రి యిదె నాలుగు వర్షములైన పిమ్మటన్
భళ్ళున తెల్లవారెను, ప్రపంచము గ్రమ్మర గాంచగల్గి నా
యుల్లము పల్లవించె, మృగయుల్ విడిపించినయంత తుళ్ళుమన్
తెల్లని పావురంబయితి, తెల్లము నీ గరిమమ్ము రాఘవా.

65. గుప్పిటబట్టి నేనడిగికొన్నది నీవిడినట్టి దొక్కటై
చొప్పడెనయ్య దేవ ! పరిశోధన సేయదలంచి కాదు నీ
గొప్పతనంబు చాటుటయె కోరి వచించితి నింతవట్టు నా
తప్పు క్షమింపుమయ్య పెడదారిని బట్టగ నేర రాఘవా.

66. సన్నుతి నంతొ యింతొ మును సల్పిన సల్పకయున్నగాని నే
బన్నమునొంది చిక్కులకు బాల్పడ, డీల్పడకుండ నెమ్మదిన్
వెన్నెలగాయ జేసితివి వెంబడి ముంబడి నుండువాడవై
మున్నుగ జాగి మ్రొక్కినను మ్రొక్కెవలెన్ మరినీకు రాఘవా.

67. ఇరువురు పొట్టి బాపలయియేపున వేకువ స్వప్నమందు నా
తరుణినిగాంచి, నీ పతికి దగ్గిదె తగ్గును, నిన్న నేడు మీ
పురమున కేగుదెంచితిమి పోయెద మంచును జంక సంచులే
ద్దెరగదలాడగా కడు వడింజనరో యొకనాడు రాఘవా.

68. కాలున్ జేతులు సల్లనై పిలుడు డాక్టర్నన్న యవ్వేళ, 'జా
ల్చాలున్, భద్రగిరీశు డొక్కడిపుడేలం జాలువా'డంటి మేల్
మేలన్నట్లుగ నుత్తరక్షణమునన్ మేలయ్యె, భక్తౌఘర
క్షాలీలాంశపుటబ్ధిలోన నిది చంచద్బిందువౌ రాఘవా.

69. కునిశిత బుద్ధియొక్క డధికుండటు నాపయి నిందలాడు నే
ర్పునకయి పర్ణశాలకును బోవుదమంచును నున్న తాధికా
రిని నియకొల్పె, తోన నడరెన్ జఠరంబున పెద్దనొవ్వు, ఆ
తనివిడి వెంటనన్నుగొనె, తద్జ్ఞులు మెచ్చరె నాడు రాఘవా.

70. కొదయనివీడి, గొప్పయని కూర్పదలంప కొకేవిధాన కొం
డ దరిని నిల్చి జారిపడినంబడు నాపదనుండి, రేగుము
ల్లు దునిసి పాద మొందు నొగులుం, దుదిగా నెనరూని భక్తు నే
లుదువని గంటకొట్టి పవలున్ నిశ లాడుచునుందు రాఘవా.

71. మృదుల తరంబు నీ హృదయ మెంతయు, నై నను రాత్రికంటె బె
ట్టిద మనిపించు, గర్మముల డెప్పరమున్ భుజియింపజేసె దొ
ప్పిదముగ దల్లియైన దినిపించదె మెల్లగ నెక్కడన్నమున్
మొదలిటినుండి స్వానుభవముంగొని పల్కుచునుంటి రాఘవా.

72. ఒక్కొక్క వేళ పిల్పునకె ఓయని పల్కెదు క్షిప్రదుండవై
ఒక్కొక్కవేళ నెంతయు నమోయను కంఠము జీరవారినన్
చిక్కెనె చిక్కవింతయును, చిత్రము నీ పరిపాలన క్రియా
బుక్కుల కర్థ మెవ్వరు రచింపగ నోపుదురయ్య రాఘవా.

73. పరుని వధింప బూనియును పట్టుగతొందర సేయకుండి దు
ర్భరమగు జాగు సేయుదువు భక్తుల యాపద బాప, నైన నే
వెరవునొ పూని కూర్మి యొదవించును మమ్ముల గన్న తల్లియై
ధరణిజ, దీనబాంధవి సుధామయ మంజులమూర్తి రాఘవా.

74. అమ్మాయంచు బదాంబుజాతయుగళంబందుందలన్ వ్రాల్చినన్
లెమ్మాయంచును లేవనెత్తి యికమే లేయయ్యెడుం బొమ్మనున్
నెమ్మిన్ నేర్పును నోర్పుగూర్చు కరుణానీరాకరంబైన సీ
తమ్మన్ మించిన యమ్మలేదనిజనుల్ ధ్యానింతురో రాఘవా.

75. తిరుమల నేడుకొండలను దీప్తి వహించెడు వేల్పు బెద్దవై
విరివిగ బెక్కు చోట్ల పలుపేరులు రూపములొంది యుండి, ని
బ్బరముగ లక్ష్మణుండు గొలువంగ నిజాంకమునందు సీతతో
నరలుచు భద్ర శైలమున వర్ధిలు చుంటివి నీవ రాఘవా.

76. మూడవకంటి మంట జగముల్ రగులన్ శివ దేవుడంతటన్
పోడిమి మీర మానవ శివుండయి లోకము వారి నేత్రముల్
వాడి మెరుంగు శస్త్రములు వాడి దురుద్ధతులెల్ల జీల్చి చెం
డాడెదు, లబ్ధ వీక్షణ సుఖాబ్ధుల కెల్లలు లేవు రాఘవా.

77. గ్రుడ్డున కల్మషంబు లవరోధములం దొలగింప, జెడ్డచో
గ్రుడ్డు బెకల్చివైచి సరిక్రొత్తది పూని ఘటింపగా శివా
రెడ్డియె చెప్ప మెప్పగు వరిష్ఠుడు, నాకనుదిద్దె, నాతనిం
దొడ్డ కృపం గనుంగొనుము తుష్టిని పుష్టిని గూర్చి రాఘవా.

78. సౌందర రామమోహనుడు సన్నుతు డున్నత నేత్రవైద్య వి
ద్యుందరిగన్న యారవ సహోదరు డంచిత సత్యమూర్తి, తా
డెందమునందుబోలె నికటీస్వకుటీ ప్రకటీకృతాదరం
బందగ జూచె మమ్ముల గృతార్థుని జేయుమువాని రాఘవా.

79. అందరు నేర్పరుల్ సుగుణులందరు చిత్తములందు మెత్తనౌ
పొందికలున్న వారు, మునుముందు సరోజిదేవి పైడి పే
రొందిన నేత్రవైద్య గృహమూర్వర సర్వజన ప్రకీర్తనా
నందమునొందు నాకు నయనస్ఫుట మియ్యెడ నయ్యె రాఘవా.

80. తమతమ కార్యతత్పరత దక్క దలపంగ నేరరన్యమున్
సుమతులు నిట్టివారు ననుజూచి నిజంబుగ నేడు రామచం
ద్రమహిమ మీయెడన్ సువిదితంబయి యొప్పినదంచు బల్కి నా
రుముదమెసంగగా, నిటుల బ్రోచెడు వారెవరయ్య ? రాఘవా.

81. పదియును నేడు నేడులకు పైబడి లొంగక పొంగియున్న నా
గదమటుమాయమయ్యెగద కంటికి గ్రొత్త వెలుంగువచ్చె, న
భ్యుదయ కరంబు నీపదయుగోజ్వల పాటలకాంతినిండి యే
హృదయమునందు నుండు నటనెక్కడి చీకటులుండు రాఘవా.

82. ఏయెడనుందువో యెరుగరెవ్వరు, పొంగులు వారచుండుదున్
నాయెడ నుందువంచు, సుజనక్రమ వాక్పరిపాటి నెంచుచో
నీ యెడలేని వాడవని యెట్టులు పల్కుదు నేదెటైనగా
నీ, యెడసేయకయ్య నను, నీపదమంటగనిమ్ము రాఘవా.

83. క్షిప్రదుడం చనంతఫలసిద్ధి యొనర్చు ప్రభుండవంచు ది
వ్యప్రథనీకెయొప్పెడి నవారితచారు తరానురాగవే
గాప్రతిమానభ క్తహృయాంతరవర్తివి, నీకు సాటినీ
వే ప్రతిరారు వేరొకరొకించుకయేని, దలంప, రాఘవా.

84. చదువన్ వ్రాయనశక్యమైయొరులచే సాయంబు సేయించుకొం
టి, దిదృక్షారతిమాసె, మీచరణపం కేజాతసంసేవనా
ముదితాస్యంబు వివర్ణమయ్యె కలయైపోయెన్ సమస్తంబు స్వ
ప్నదశన్ మీదయ జాలువారగనె విన్నాణంబుగా, రాఘవా.

85. నాకన్నోయికి దివ్యదీప్తినిడుచందంబొప్పమింజేసి లౌ
క్యాకారంబుల బూనివచ్చెదవు, ప్రత్యక్షక్రియల్ సంకట
ప్రాకట్యంబులటంచు స్వప్నగతులం బాటించుచున్నావు పెన్
వీకన్, నీవ కదా యనంతగుణ గంభీరుండవో రాఘవా.

86. రూపంబెయ్యెడ నెప్పు డెట్లయిన కారుణ్యంబులేశంబు కా
దా పారంపరి నేను వేడునది డెందంబందు నూహించినీ
రూపౌదార్యగుణప్రభావగరిమల్ రూపించిసేవించెదన్
నాపాపంబులబాపి పున్నెముల పండంజేయవా రాఘవా.

87. కరములుమీకుమోడ్చెదను, కంఠము మ్రోయనొనర్తుమీస్తుతిన్
విరివిగమీకథల్ వినెదవీనుల, కన్నుల మిమ్ము గాంచెదన్
జరణయుగంబు మీసదనసన్నిధిజేర్తు, నెదన్ దలంచుచున్
గరగెద కప్రపుంబలుకుగా భవదంతికమందు రాఘవా.

88. సారూప్యంబుముముక్షుదివ్యపదముల్ సాయుజ్యసాలోక్యముల్
గోరన్ నెమ్మది; నుట్టియందనిది నాకున్ స్వర్గసోపానపం
క్త్యారోహంబగు నేతలంప, భవదీయాత్యంతసాంతత్యచిం
తామరమ్యస్థిరబుద్ధి నిల్పుమనుచుం బ్రార్థించెదన్ రాఘవా.

89. అన్నపురెడ్డిపల్లె పురమందు వెలింగెడు వేంకటేశ ! బ
య్యన్న పురీవరేశ్వరుడవైన రమా సహ సత్యదేవ ! శ్రీ
మన్నరసింహ ! యాదగిరి మంజు ధరాధర కందరాంతరా !
అన్నవరాధినాథ ! యని అందరలో నిను గందు రాఘవా.

90. రాముడ వందునో యఘువిరాముడ వందునొ భక్త హృత్తమ
స్సోముడ వందునో నృపతి సోముడ వందునొ జానకీ మనః
కాముడ వందునో విగత కాముడ వందునొ గాక యాపరం
ధాముడ వందునో నుజన ధాముడ వందునొ నిన్ను రాఘవా.

91. వగలెన్నేనియు వచ్చె వచ్చిన మొదల్ బాగీప్రమాదీచ యెం
తగ వేధించునొ అంతమందునని స్వాంతంబందునూహింప, నిన్
బొగడంజేసె, గనంగ జేసె జగమున్ బొల్పారు నానందనొ
ప్పుగ జూపించితొలంగె, నీమహిమ సర్వోత్కృష్టమో రాఘవా.

92. గడియల్ జాములహస్సులున్ నిశలు చక్రప్రకియందొర్లుచున్
వడి వర్షంబులునై మహాయుగములై వర్తిల్లు కాల స్వరూ
పుడ, విక్కాలము నీయధీనమయినన్ మోదంబు ఖేదంబు లే
ర్పడు కాలాను గుణంబుగా ననుట నేరన్ నమ్మగా రాఘవా.

93. అరయంజాలెదు రమ్మునేడె నవపర్యంకోత్సవంబన్న వై
ఖరి బిల్వంబడి నట్లెవచ్చితిమి చక్కన్ సాగె పైనంబు, సుం
దర తల్పంబున దివ్యసుందరుడవై తన్వంగియౌ సీతతో
మురిపంపుం బవళింపు జూచితిమి మా పున్నెంబునన్ రాఘవా.

94. తగదృష్టిం బరిపుష్టి గూర్చు, నిను మోదంబార భద్రాద్రిలో
ఖగరాడ్వాహునొనర్చి దివ్య గమనుంగా జేసి తిర్వీధి నీ
సొగసున్ గన్నుల కర్వుదీర గనుగొంచున్ ధన్యజీవుండ నై
తి, గృతార్థుండను దేవదేవ ! త్రిజగత్ క్షేమంకరా ! రాఘవా.

95. కరి గాంచింది మొదల్ కదల్ కథలుగా గాధాశతుల్ వింశతుల్
వర భక్తావన పావనాతిశయముల్ వర్ధిల్లు నేతాదృశ
స్ఫురణల్ విన్న బఠించినన్ నుడివినన్ భోగ్యానుభోగ్యంబులు
ర్వర నిండించుచు నిత్తువంతమున గైవల్యంబునున్ రాఘవా.

96. తేలితి ఘుంఘుమం ఘుమల తెప్పల నీదగు వంట యింటి కుం
దేలుగ నుండి, ప్రాభవ ప్రతిష్ఠలు వర్ధిల నేట నేట సీ
తాలలనాకర గ్రహణతత్పరతావకవైభవోత్సవ
శ్రీలను ముగ్గితిన్, మది ధరించితి నా స్మృతులెల్ల రాఘవా.

97. నీ మృదునామగాన మధునిర్భర వాహినులందు నెన్నియో
జాములు నీదులాడితిని, సజ్జనకోటులు రామకోటులం
బ్రేముడి దెచ్చి గుట్టలుగబెట్టి యజించి భజించి యెంతయున్
మైమఱపించి, రట్టివిక్షణంబులు నాకికరావు రాఘవా.

98. నెయ్యము గల్గువారు నను నీదె యదృష్టమనన్ ముఖస్తుతుల్
చయ్యన జేసిరంచు బరుసంబుల నాడితి, నేడుసూడ నా
కయ్యవియే పవిత్ర సమయంబులుగా మది గానుపించెడిన్
వెయ్యి భవంబులెత్తిన లభించునె యావిభవంబు రాఘవా.

99. ఎన్నియుగాలు నొచిరొకొ ఇమ్మెయి నీ మెయి నూనెరాచి పా
లున్నెయి మేలిపండ్లు సుధలున్ గొనుచున్ స్నపనోత్సవంబు ల
భ్యున్నత వేద ఘోషముల నొప్పుగ దీర్చి సమర్చ పూజ సే
యన్ని రతంబు నర్చక బుధావళి, పూజ్యులు వారు రాఘవా.

100. జపమున్ సంశ్రవణంబు కీర్తన మనుష్ఠానంబు జ్ఞానంబునున్
దపముం దీర్ఘము నామలేఖన మెరుంగన్నేర నింతేనియున్
జపలుండన్ ఖలుడన్ దురాగసుడ జాంచల్యంబుమాయించియె
ట్లుపలాలింతువొ నీవె దిక్కనెడు నన్నో జానకీ రాఘవా.

101. ఆడిన మాట తప్పని యెయారపు మూర్తివి, ఒక్క చానకే
తోడుగ నుండువాడవు, కృతున్ సలుపన్ గృతినందుకొమ్ము మా
ఆడకుమయ్య బాహుపరిఘాయత గుప్తికి జాలనైన రా
మోడుగణేశ ! నీ చరణ యుగ్మము నంటగ నిమ్ము రాఘవా.

102. ఈ చిన్నారి భవద్విలాసమును వ్రాయింపించుకొన్నావు, నీ
దే చాతుర్యము, నీదె వాగ్విభవ, మిందేముందు నాస్వంతమై,
వాచాలత్వ మొకింతయున్న నది నావాచ్చంబు భద్రాద్రి ధా
మా ! చాపల్యము బాపి సద్గతులనిమ్మా జానకీ రాఘవా.

103. స్ఫుటభక్తిన్ గృహదైవతంబవగునిన్ బూయించునాయింతి వేం
కటరామాఖ్యను, రంగసీతదుహితన్, బాలామణిన్ శ్యామలన్,
ఘటితానంద మెలర్ప నేలుమసుతున్ నారాయణున్ గన్యకా
వటుయుగ్మాత్మ సతీసమేతు నెపుడున్ భద్రస్థితిన్ రాఘవా.

104. ఘోరతమంబు మృత్యువను క్రూరమృగంబని భీతినొంద, నె
వ్వారికి జావుతప్పదది బత్తెముదీరిన గూరుచుందురే ?
సారవిహీనమయ్యును ససారముగా జరిగించినావు సం
సారము, తృప్తి యొక్కడికి ? చాలునిదే పదివేలు రాఘవా.

105. నాలుక గల్గినందులకు నాలుకపై తగునంచు నక్షరాల్
నాలుగు నేర్చినందులకు నల్గురిలో దిరుగాడి నందుకున్
నాలుగు చేతులొడ్డి ధర నాల్గుచెఱంగుల మేలుగూర్చు నా
యేలికవైన నిన్ను వినుతించిన భాగ్యముగంటి రాఘవా.

106. పలికిన నిన్నె పల్కవలె భావమునన్ ధృడమైన వైఖరిన్
నిలిపిన నిన్నె నిల్పవలె నెమ్మది నిమ్ముగ మ్రొక్కి సన్నుతిన్
సలిపిన నిన్నె సల్పవలె చల్లగ భక్తులకెల్ల నిష్టముల్
గొలిపిన నీవె కొల్పవలె గొప్పలు చెప్పుటకాదు రాఘవా.

107. ఇక పల్మాటలు వేయునేమిటికి నా కింపారగా శేష జీ
విక సౌఖ్యాంత మధైన్యముం జలిపి నిర్భీకంబుగా నిత్య స
త్య కళాదీధితు నిర్వికారు బరు నిర్ద్వంద్వున్ నిరాతంకు ని
న్న కలంకుం దలపోయుచుండు మతినిమ్మా జానకీ రాఘవా.

108. మంగళ మోయనూహ్య మహిమాంచిత భూమిసుతాసమన్వితా !
మంగళ మార్యవర్యసుత మానితరూప విలాస విశ్రుతా !
మంగళమో నిరంతర సమాశ్రితలోకదయో దయోత్సవా !
మంగళమయ్య భద్రగిరి మందిర సుందర ! రామ ! రాఘవా !

109. ఇది శ్రీ వత్ససగోత్ర కొండపలి వంశీయుండు భద్రాచలేం
ద్ర దయావర్ధిత రామచంద్రకవి మూర్ధన్యుండు ధన్యుండు మే
లొదవంబల్కు "సమక్ష రాఘవము" భక్త్యుత్సాహ సంధానమై
చదువన్ విన్నను దీయనై వెలయునాచంద్రార్క తారంబుగన్.

110. భరతక్షోణి బ్రజల్ పరస్పరము నవ్యాజానురాగాత్ములై
సరసౌదార్య గుణాఢ్యులై వినుత శాస్త్రజ్ఞాన సంపన్నులై
వరలన్ బాడియు పంటలొప్పి విబుధైశ్వర్యం బవార్యంబుగన్
ధర బెంపారుత నన్ని దేశముల సాంద్రఖ్యాతి దీపించుచున్.

*సమక్ష రాఘవము సంపూర్ణము*



# భద్రగిరి దాశరథి శతకము

- శ్రీమాన్ నరహరి గోపాలాచార్య

ఉ. శ్రీరమణీయధామ ! బుధజీవనకామ ! స్వపాదసంశ్రితో
దార కటాక్షసీమ ! దురి తప్రకరప్రవిరామ ! ధూతదు
ర్వార తరారిభీమ ! పరిపాలయ మాం శరణాగతం భవో
త్తారకనామ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥1॥

ఉ. రాజలలామరామ ! కవి రాజవిరాజిత దివ్యనామ ! వి
ద్యాజయకామ ! భక్త జన తాప్రణయాంబుధిసోమ ! నిత్యని
ర్వ్యాజదయాభిరామ ! సమదారిసురారిసుభీమ ! దాసహృ
ద్రాజితధాత ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥2॥

చ. మరకతనీల దేహ ! బుధమానితమౌనిసమూహ ! ధూతదు
ర్భరతరమోహ ! దుర్మదవిరాధఖరాదిహరేహ ! భూమిజా
వరహృదయాఽధిరోహ ! నతపావనవిప్రవిదాహ ! సత్సము
త్కరశుభదోహ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥3॥

ఉ. శ్రీరమణీకళత్ర ! యతసీకుసుమాంచితగాత్ర ! ధర్మవి
స్తారలసచ్చరిత్ర ! హరధాతృకృతస్తుతిపాత్ర ! ఘోరసం
సారభవాంధకారచయ సారసమిత్ర ! సురారిజైత్ర ! వి
స్తారవిచిత్ర ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥4॥

ఉ. శ్రీవనజాక్ష ! దుష్టజన శిక్ష ! దయామయవీక్ష ! మౌనిసం
జీవనదక్ష ! నవ్యతులసీజలజాగరుచందనాది సం
భావితవక్ష ! సంశ్రితసభాజనపక్ష ! విరోధిరూక్ష ! స
త్పావనదీక్ష ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥5॥

ఉ. శ్రీద ! సనందనాదిముని సేవితపాద ! సమస్తనిర్జరా
మోద ! సమాశ్రితార్త భయమోహవిభేద ! సుదీనభక్తలో
కాదరణక్షమోజ్వల కృపాంచిత దివ్యకటాక్షవీక్షణో
త్పాదితఖేద ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥6॥

చ. దురితతమఃపతంగ ! ఖరదూషణ దుర్మదభంగచంగ ! సం
భరిత సుఖాంతరంగ ! యనుభావితసాధుజనానుషంగ ! రా
గరహితభక్తసంగ ! భుజగప్రతిపక్షతురంగ ! హస్తసం
ధరితరధాంగ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥7॥

చ. సనకసనందనాది మునిసన్నుతపాదసరోజ ! భక్త హృ
ద్వనరుహ భృంగరాజ ! సతతస్ఫురదున్నతతేజ ! పంకజా
సనముఖ దేవతేష్టఫల సాధనకల్పకభూజ ! ధర్మసా
ధనతరుబీజ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥8॥

చ. కుసుమశరోపమాన నవకోమల మేఘశరీర ! జానకీ
రసిక మనోఽబ్ధచోర ! వరరాజకలాధరమానసాంబుజ
ప్రసృమరసద్విహార ! రిపువర్గవనీవిహరత్కుఠార ! సా
ధ్వసపరిహార భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥9॥

ఉ. భూపవనాంబరాగ్ని జలభూతవివృద్ధ జగన్నివాస ! ది
గ్వ్యాపిత సద్యశోవిశద భాస ! సురాహిత కంఠలుంఠ నా
రోపిత దోర్విలాస ! రుచిరూషితకాంచనవాస ! దాసహృ
త్తాపరానిస ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥10॥

చ. పరమపవిత్రయోగిజన వాంఛితపాదపరాగ ! యిందిరా
కరమణికంకణోల్లస దఖండరుచిస్ఫుటవామభాగ ! శ్రీ
కరభుజగేంద్ర తల్పపరికల్పిత దివ్యసుషుప్తియోగ ! సుం
దరగుణపూగ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥11॥

చ. వరమణిభూష ! ఘోరభవ భారహరప్రతిభావిశేష ! భూ
సురపరితోష ! ధర్మగుణశోభిత నిస్తులసత్యభాష ! సం
భరిత విచిత్రవేష ! నిజభక్త మనోఽంబుజపూష! ధూతదు
స్తరతరదోష ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥12॥

చ. పరమదయాలవాల ! పరిపంథివనానలకీల ! క్షీరసా
గరతరళోర్మిశీకర వికాశిత మౌక్తికజాల ! నిశ్చలా
బ్ధిరసమానయోగపదవీగత సాధుజనపాల ! సుం
దరశుభచేల ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥13॥

ఉ. లోకజనాపకృద్దనుజ లోకపరీవృత సోమకాసురా
స్తోకతర ప్రతాపవటు దోర్బలకానన వీతిహోత్ర ! నా
ళీకభవాంతరంగ సుదృఢీకృత భాసుర వేదసూత్ర ! మో
దాకరగాత్ర ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥14॥

ఉ. మందరభూమి భృద్వహన మానితనిష్ఠురపష్ఠభాస్వర
త్సుందరకచ్ఛపాకృతివి శోభిత ! సర్వసుపర్వమానసా
నందసుధాప్రదాతృ కరుణాగుణభూషిత ! దేవదేవహృ
న్నందిత ! భవ్య భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥15॥

చ. జలనిధివేష్టితోర్వితల సంతతజంతు సమృద్ధృతి ప్రశ
స్తలసదుదార భాసురవిషాణవరాహశరీర ! గాఢదో
ర్బలవిపినాంతరస్థిత హిరణ్యదృగున్మదకుంభి మారణో
ద్బలహరివీర ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥16॥

చ. ప్రలయదివాకర ప్రతిభాసదృగబ్జ దధన్న కేసరీం
ద్రలలితదేహా ! మేరుశిఖరప్రతి మానసురారినాయకో
జ్వలభుజసార పావకనివారణ నిర్ఝరవారివాహా ! ని
ర్దళితవిమోహా ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥17॥

ఉ. వాసవరాజ్యభోగ సమవస్థిత రాక్షసరాజసంపదు
ల్లాసహరప్రతాప ! శుభలక్షణబాడబవంశసంభవో
ద్భాసితఖర్వరూప సుపథప్రణతాఽఖిల లోకరక్షణా
ధ్యాసకలాప ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥18॥

చ. పరమతపోవిశేషరుచి భాసుర భూసురజాత ! క్రూరభూ
వరసకిరీటమస్తకవి భంగవిధానపరీత ! దోర్విలా
సరుచిరసత్పరశ్వధల సద్ఘనకీర్తిసమేత ! శాంతిత
త్పరసముపేత ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥19॥

ఉ. క్ష్మాతనయా మనోవిమల సారసమిత్ర ! దశాస్యకంఠసం
ఘాతవిలుంఠనప్రథిత కార్ముకధారణ చిత్ర ! కోసల
క్ష్మాతలనాథపుత్ర ! హనుమత్ స్తవనీయచరిత్ర ! భక్త హృ
త్పాతకజైత్ర ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥20॥

ఉ. మోహన వేణుగానరస మోహితగోపవధూభుజంగ ! రా
ధాహృదయాబ్జభృంగ ! హిమధామనిభానన భాసురాంగ ! దా
సాహితకారి దుర్జనచ యాంధతమిస్రపతంగ ! సత్యసం
ధాహితసంగ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥21॥

చ. ప్రవిమలశాంతమానస విభాసితసుందరబుద్ధరూప ! దై
త్యవిసర కామినీహృదయ దాహకమోహక వాక్ప్రతాప ! వి
శ్వవిశదబోధనాద్యఖిల భావనిరూపిత సత్యదీప ! శా
త్రవభృతరోప ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥22॥

ఉ. క్రూరసురారిసంఘగళ కుంఠనఘోరకృపాణశౌర్యవి
స్తారభుజప్రతాపవిత ధప్రతివీర ! సుధీహృదబ్జసం
చార ! సితాశ్వసంగ్రథిత జైత్రవిహార ! శుభప్రచార ! భూ
ధారణశూర ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥23॥

చ. సురుచిరభక్తి యోగపరి శోభితదైత్యతనూజచింతనా
పరిమితతోష ! భక్తజన పాలనసుస్థిరవేష ! దుష్టభీ
కరపరిభాష ! సంయమిని కాయమనోహరవాగ్విశేష ! వి
స్తరమణిభూష ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥24॥

చ. దశవదనానుజాత్మపరి తాపహరాంచిత ధైర్యసార ! ది
గ్విశదయశః ప్రపూర్ణ రఘువీర ! నిజాంఘ్రియుగాశ్రితార్యసం
ఘశరధిశర్వరీకర ! యఖండపరాక్రమ దుర్నివార ! భ
ద్రశుభవిచార ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥25॥

ఉ. వారిచరప్రపీడన నివారణభూరి నమోనమఃక్రియాఽ ఽ
వారణవారణార్తిహర ! వారిజనాదవిఘూర్ణి తాష్టది
గ్వారణకర్ణకోటర ! వికాసితకీర్తివిలాసమంగళో
ద్ధారవిహార ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥26॥

ఉ. భారతవర్ష గౌరవశుభప్రతిపాదక ద్రౌపదీభయో
త్తారణమానరక్షణవిధానవరిష్ఠ ! సుయోధనాదిధా
త్రీరమణోద్ధతాద్భుత కరీంద్ర మృగేంద్ర కలాగరిష్ఠ ! వి
స్తారపటిష్ఠ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥27॥

ఉ. గౌతమకామినీ భవవిఖండన పాదరజఃప్రభావ ! గో
త్రాతనయా పరిగ్రహణ తత్పరసత్వరితస్వభావ ! ధా
త్రీతలనాథరాజిత కిరీటమణిప్రవిభాసనూపురా
త్యాతతరావ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥28॥

చ. చిరసువిచార సద్గుణవిశిష్ట ధ్రువావని పాలపూజనా
పరిమితహర్ష భూషిత ! భవప్రముఖాఽ ఖిల దేవతోన్నత
స్థికపదవీప్రదాన పరిశీలనశోభిత ! సర్వలోకసుం
దరభృత భవ్య భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥29॥

చ. సలలితభోగిభోగ విలసన్మృదుతల్పశయాన ! నిత్యని
స్తులకరుణానదీన ! పరితోషిత గోపవధూనిధాన ! కో
మలతులసీ కుశేశయసమంచదురస్థ్సలభాసమాన ! స
త్ఫలసువిధాన ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥30॥

చ. అగణిత సత్యదీక్ష ! శరణాగతరక్ష ! ధనుఃప్రభావళీ
విగళితశత్రుపక్ష ! పృధివీతనయా కుచకుంకుమార్ద్రసౌ
భగశుభసౌరభాఽభిహితవక్ష ! సురాహితసర్పదర్పహో
త్ఖగపతిరూక్ష ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥31॥

చ. అనుపమకోసలేశ తనయాజరరాంబుధిచంద్ర ! దీనభ
క్తనిచయ రక్షిణవ్రత విధానమహత్కరుణాఽత్రిసాంద్ర ! పా
వనతరదివ్యనామ పరిపాలిత సర్వబుధేంద్ర ! ధర్మన
ర్తనవిహితేంద్ర ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥32॥

ఉ. శ్రీజనకాత్మజాహృదయ సింధుసుధాకర ! దీనభక్తర
క్షాజయశీల ! స్వీయపదకంజయుగ ప్రణతాఖిలామర
భ్రాజితసత్కిరీట ! నతపాలనసద్వ్రత పాహిమాం నమ
ద్రాజవరేణ్య ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥33॥

ఉ. రాకలు బోకలుంజలిపి రాయిడి పెట్టదలంచునట్టి యీ
ప్రాకృతకర్మవాసనలు బారcగజిమ్మి భవత్పదాబ్జయు
గ్మైకశరణ్యుcనిన్ జలుపcగామదిలోన దలంచుమయ్యభ
ద్రాకరమూర్తి ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥34॥

చ. మరిమరివీడిపోక యసమానముగా హృదయార్తి రేపి భీ
కరముగ దుర్నివారకముగా బయిదూకుచునున్న ఘోరదు
ర్భరభవవహ్నినాపగల వాcడశరణ్య శరణ్యుcడొక్క శ్రీ
ధరుడవునీవ భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥35॥

చ. ప్రకృతియుఁ బూరుషుండును భవత్తనుభూతులుగాననీదు నా
జ్ఞకువశులౌటతప్ప దటుగాననహమ్మతి బాపినన్నునీ
యకుటిలసేవలోనిలుచు నట్లొనరింపగదయ్య చిత్సుఖా
త్మక సుశరీర ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥36॥

ఉ. ఎంతటిదాకనిన్ను హృదయేశ్వరునే శరణంబువేడనో ?
యంతటిదాక రాగముఖమౌగుణపాళియు చోరపాళియౌ
నెంతయుబందిగంబయగు నిల్లును మోహము శృంఖలంబగున్
డంతివరేణ్య ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥37॥

చ. అనవరతంబనిత్య మసుఖాస్పద మిజ్జగమెల్ల దీనిలో
జననముగాంచునీవు ననుసంతతమున్ భజియించుమంచునీ
వనితివిగీతలో నెటుల నౌనదిసాధ్యమటుల్ మహద్దయా
ధనగనుమీవె భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥38॥

ఉ. భద్రుఁడనంగనొప్పు ముని భద్రుడదభ్రసునిష్ఠ నిశ్చలా 2
చ్ఛిద్ర తపంబొనర్ప నది చిత్తమునందు బరిగ్రహించు చు
ద్యద్రమణీయ దివ్యతను ధారణముంగని నిల్చినావు భ
ద్రాద్రిని నీవు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥39॥

ఉ. తమ్మలదమ్మకన్గరుణ దన్పితి వాపయి రామదాసునిన్
సమ్మతిబ్రోచి తీవతని సఖ్యముగల్గిన తానిషాపయిన్
జిమ్మితివాశ్రితావనవి శిష్టమునైన కటాక్షపంక్తి సీ
తమ్మయు నీవు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥40॥

చ. పరమును వ్యూహమున్ విభవభంగియు నాంతరముంగనంగజా
లరు నరులంచుఁ బ్రాకృతవి లక్షణతన్ శుభదార్చనాతనూ
ధరుడవునౌచు స్వీయపద దాసులనేలఁగ నిల్చియున్న శ్రీ
ధరుఁడవునీవు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥41॥

ఉ. పుణ్యజనాధివాసమయి పొల్పగుచున్నటువంటి దండ కా
రణ్యసుగౌతమీతటవి రాజిత భద్రనగంబునందు కా
రుణ్యముమీఱ చాపమును రోపముఁదాల్చి వసించినావు స
ద్గణ్యుడఁవౌచు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥42॥

ఉ. జానకి నీవు లక్ష్మణుడు సంవసియించినయట్టి గౌతమిన్
స్నానముసేత మీచరణ సన్నిధిసేవ భవన్మహాలయో
న్మానిత చక్రదర్శనము మాకు లభింపఁగజేయు మాశ్రిత
ధ్యానపదాబ్జ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥43॥

చ. జయమగునీకు నీదునను జన్మనకున్ జనకాత్మజాతకున్
జయమగువాతసూతికిని శంఖ రథాంగశరాస నాళికిన్
జయమగు గౌతమీనదికి సాధుబుధోత్తమపాళి కుల్లస
జ్జయమగుగాత ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥44॥

ఉ. పుట్టిననాటనుండి యసువుల్ తమకర్పణసేయుగోపనన్
బెట్టినబాధలెల్ల పృథివీసుతయే గమనించి దేవస
మ్మాట్టుననిన్నుబంపి ఋణమంతయుదీర్చినతల్లి సీతమా
తట్టగుగాత భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥45॥

చ. విరజయె గౌతమీనదిగ విష్ణుడవీవుగ లక్ష్మి జానకీ
తరుణిగ శేషుఁడేయనుగు తమ్ముడుగాగ నయోధ్య భద్రభూ
ధరముగ నిత్యసూరులును దాసులు దేశికులై మెలంగునిన్
దర మెనుతింప భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥46॥

చ. భవదవదాహతాపముడుపన్ శ్రితపాళికి భద్రశైలమం
దవిరళతాసమృద్ధిగనె నద్ధరణీతనయాతటిద్యుతం
బవురఘువీరనీరద మహా ! దరిసింపఁగనిమ్ము దీనబాం
ధవ ! కృపతోడ భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥47॥

చ. అమితభవాగ్నితాపమున నన్వహముం బలవించునట్టి దీ
నమతినన న్న హేతుకరుణం గరుణింపఁగరందు జానకీ
రమణినిగూడి శ్రీరఘువరా ! యిక భాగవతాభిమానపా
త్రమునగువాడ భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥48॥

ఉ. కోరినవారి కెల్లరకుఁ గొంగుపసిండియనంగనుంటి వ
ద్ధారిణికన్యతోఁ బ్రణమతాంశరణంబుగఁ గొండమీదటన్
గోరిభజించువారలెదఁ గోరినకోర్కులొసంగు భక్తమం
దారమవీవు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥49॥

ఉ. ఏనుస్వయమ్ముగా సుకృతమించుకఁ జేసిన దేదిలేదు నీ
మానితసత్కృపన్ సుకృతమన్నదొకించుక సంక్రమించున
ట్లైన మదీయులందఱకు నందఁగఁజేయుము నాకునీపద
ధ్యానమెచాలు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥50॥

చ. తనువుఁదృజించుటెప్పటికిఁ దప్పదురా ? ప్రభు ! అప్డు ? నీదుకీ
ర్తనఁ గఫవాతపిత్తములు గ్రమ్ముటచేత నొనర్పలేనుగా
వున నిపుడేస్మరించువటుఁ బూర్ణకృపంగనుమయ్య మ్రొక్కెదన్
దనుజవినాశ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥51॥

ఉ. ఆత్మలకాత్మవైన పరమాత్ముఁడ వంతటనుందు వద్దినా
యాత్మకుదోఁచనట్టి విషయంబగదా ? సులభార్చనాంగకా
ద్యాత్ముఁడవైననీదు చరణాంబుజముల్ సిరసావహించి భ
ద్రాత్ముడనౌదు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥52॥

ఉ. శ్రీ రఘురామురూపుగనఁ జింతనజేసిన భద్రుఁబ్రోవ ల
క్ష్మీరమణీయుతంబు దయచేసితి వాశ్రితవత్సలత్వ మిం
పార స్వరూపవిస్మృతి నహా ! సుమహాద్భుతముల్ భవద్దయో
దారతలెల్ల భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥53॥

చ. కృతులునుతుల్ రచించి యిటనే యిలువేలుపుగావసించు శ్రీ
క్షితితనయేశుపాదముల జేర్చితి నియ్యది భద్రశైలసం
గతుఁడగునీకు దాశరథి కావ్యసమర్పణఃజేతు శ్రీ సము
ద్యతమతిఁగొమ్ము భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥54॥

చ. మృదుపదభంగిమల్ లసతమేయసువృత్తములున్ శుభప్రదా
స్పదస దలంకృతుల్ గలుగు సాధ్వి కృతీందిర జేరవచ్చెనీ
పదసరసీజసన్నిధికిఁ బాణిగ్రహించి రహించుమీ జగ
త్పదనపిచండ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥55॥

చ. ఎలమిదలిర్ప నెల్లర కృతీందిరలంగ్రహియించినట్టు లీ
లలితకృతింగటాక్షమునఁ లాలనఁజేయుచు నన్నుతార్థుగాఁ
జలుపుము చంపకోత్పల సుసౌరభకీర్తి దిగంతరాంత ర
స్థులులెగఁబ్రాక భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥56॥

చ. ప్రతిపదమందుకుప్పలుగ వర్తిలుచుండును తప్పులైననీ (లయ్యునీ)
కృతియగుగాన భోగ్యమగు నెల్లరకంచు దలంతు నిక్షువ
క్రతలెటులున్న ? దాని మధురత్వమె శ్లాఘ్యతగాంచినట్టు లు
ద్యతవిభవాఢ్య ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥57॥

ఉ. ముద్రణలైననున్ మఱియ ముద్రణలైనను మత్కృతుల్ ద్వద
క్షుద్రకటాక్షవీక్షణము సోకినజాలు భవన్మనంబునన్
ముద్రణలై వెలింగెడి సమున్నతభావవిభాసముజ్వలో
ద్యద్రుచిమీర భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥58॥

చ. ఇరువదియేండ్లక్రిందట నొకించుకజూచితి జ్ఞాపకమ్ములే
దరువదియేండ్లు వచ్చినవి రా !! ప్రభు ! స్వీయులతోడవచ్చినీ
దరిసెనమాచరింపమది తల్లడమందెడుగాని ? యెప్డునీ
దరిసెనమిత్తొ ? భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥59॥

చ. మనసుకఱంగనిన్గొలుచు మానవుడుండడుగాని యుండుచోఁ
దనువును రూపము న్మరచి దాసులకున్గనుపింతు వట్లె భ
ద్రునెదుట నాల్గుహస్తములతో దరచక్రములొప్ప నిల్చితౌ
దనుజవినాశ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥60॥

చ. సిసలగుభక్తులందఱకుఁ జిక్కెద వాత్మ నిజాత్మతోడ సం
తసమున వాయుసూతియును దానవపత్నియు నీదువిష్ణుచి
హ్నసముచితాకృతింగనెడు నట్లొనరించితిపూర్వ మత్యుదా
త్తసుగుణభద్ర ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥61॥

ఉ. చూచితి గోలకొండ నటఁజూచితి దానిషగారి దేవిడిన్
జూచితి రామదాసకవిఁ జొన్పినబందిగృహమ్ము దానిలో
జూచితినీవుఁ దమ్ముడును జొచ్చినద్వారముఁ దత్ప రాగమున్
దాచితిమౌళి భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥62॥

ఉ. ఆపదలందునాదుకొను నట్టిదయానిధివంద్రుగ్రాని యా
గోపనగారు పొందిన యకుంఠితశిక్షలకంతుగల్గ ? ద
త్యాపదలున్న నేమనుతువా ? మము ? బాధలకోపుటెట్లురా !
తాపసవంద్య ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥63॥

ఉ. బోయతయైన యాశబరి పుణ్యమదేమొ ? ప్రభూ ! త్వదర్థమై
తీయనిపండ్లు దాగొటికి దేవరవారికొసంగ తృప్తిమై
హాయిగనారగించితి రహా ! యటువంటి యదృష్టమేమిలే
దాయెను మాకు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥64॥

ఉ. గట్టిమనంబులే కఁకడుకల్మషముల్ బొనరించునన్ను మీ
తట్టుకులాగి మీచరణ దాస్యమొసంగుచు హైతుకంబుగా
బుట్టిన మీ కృపారసముఁ బూన్కి నొసంగుము నాదుపాపపుం
ధట్టములాపి భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥65॥

ఉ. రావణకుంభకర్ణముఖ రాక్షసవర్గ వినాశనార్థమై
శ్రీవనయాత్రఁజేసితిరి సీతయుఁ దమ్ముఁడు నీవుఁగూడి గో
దావరి తీరభూములకు దండకయెల్ల బవిత్రకీర్తికిం
దావలమయ్యె భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥66॥

ఉ. శూర్పణఖమ్మ నాడు నిను జూచివరించెను కోటికోటికం
దర్పసమానుఁడిద్దశరథప్రభుపుత్రుఁడటంచు మోహద
ర్పార్పితచిత్తయౌచు నటువంటినినుంగనుపింపు నామనో
దర్పణమందు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥67॥

ఉ. గౌతమపత్ని శాపము విఖండనఁజేయగ గౌశికర్షి సం
ప్రీతికి కాల్నడన్ వన భువింజరియించినయట్టి నీపదా
బ్జాతము లాత్మలోన నిలువంగరుణింపు మికైఁనగాని సీ
తాతరుణీశ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥68॥

ఉ. మాయమృగమ్ముఁదెమ్మనుచు మైథిలిగోరిన లక్ష్మణుండు మీ
రీయెడబోకు డాశరులదేయగు మోసమటంచు బల్కినన్
బాయక దాని వెంటఁజను త్వత్పదముల్ స్మరియింతు భద్రసం
ధాయకమంచు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥69॥

చ. హరి ! పరమాత్మ ! కృష్ణ ! శరణాగతవత్సల ! రామచంద్ర ! శ్రీ
ధర ! మురసంహరా ! యఘువిదారక ! మాధవ ! నారసింహ ! సా
గరశయనా ! యటంచు బలుకంగరుణింపగదయ్య మ్రొక్కెదన్
తరణికులేశ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥70॥

ఉ. కాకినిగాచినావు ముదిగ్రద్దకు మోక్షమొసంగినావు సీ
తాకమనా ! యకారణకృతంబగు త్వత్కరుణాకటాక్షవీ
క్షాకమనీయ సౌరభవికాస మచింత్య మనల్ప మాత్మమో
దాకరణంబు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥71॥

చ. పిలిచె నమస్కరించెఁ బలవించెను దిట్టెను రామదాసు ని
ర్మలమతి యట్టిభాగ్యగరిమల్ వెయిజన్మలకేని నస్మదా
దులకులభింపబోవ ఖిలదోషహరా ! మముసంక్షమింపఁగా
దలపగదయ్య భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥72॥

ఉ. నెట్టెద దుర్భరాఘచయ నిష్ఠుల నారకమం దటన్న నీ
గట్టిమనంబుమార్చుటకుఁగా నిరతంబునహైతుకంబునై
నట్టి కృపన్ భవద్ధృదయ మందిముడించెడుమాత సీత మా
తట్టగుగాత భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥73॥

ఉ. ఎన్నిదినంబులేడ్చిన నొకించుకలాభముగానరాక యా
పన్నితనొంది గోపనయపారకృపార్ఝరియైన జానకిన్
సన్నుతిజేసి యామె కృప సౌఖ్యముగాంచెనటౌట నామెనా
తృన్నుతిజేతు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥74॥

ఉ. దండితశత్రువైన రఘుధాత్రిపుమించినదైవ మెల్ల బ్ర
హ్మాండములందు లేడనుచు హస్తిపయిన్ గడగట్టి భేరికా
డాం, డడ, డాండ నాదములిడన్ ముదమున్గనునట్టి నీదుకై
దయండయెయండ భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥75॥

చ. శరణమన్న నే కరుణసల్పెడి మీదగుదివ్యగోష్ఠి మా
ధరణిజ, సాపదాధజన తాతగిఁగారకమున్నె బ్రోచుచున్
గరమతిలాఘవంబుగ నొనర్చెనహో ! క్షమయెల్ల జానకీ
తరుణిదెసొమ్ము భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥76॥

చ. విలపదనల్ప భాగ్యము లభింపఁగ జేసియు నింకవీనికం
జలిభరధారికిం దగిన చందముగానిడనైతినంచు నెం
జిలిబడు మాధరాసుతకుఁ జేతులుమోడ్చునటుల్ బొనర్పు ము
త్పలదళగాత్ర ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥77॥

ఉ. మానితసద్యశంబుఁ దగుమాత్రముగల్గినయట్టి నీకు దు
ర్దానవదర్పనిర్దళన తాఱసమ దివ్యయశంబదెల్ల మా
జానకి చెట్టఁబట్టుటనె సంభవమౌట యధార్థమౌనుకా
దా ? నతవీర ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥78॥

ఉ. దూషణముఖ్యరాక్షసుల ద్రుంచితి విచ్చటఁ తచ్చరాఱతిసం
శోషితదేహు దూరమునఁ జూచినజానకిచే స్వయంగ్రహా
శ్లేషసుఖంబుగాంచితి వశేషబుధుల్ గొనియాడునట్లు స
ద్భూషణశీల ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥79॥

ఉ. వంచనలేకబెంచితి నవారిగ స్వీయసతీసుతాదులం
దంచితమైన ప్రేమ మకటా ! భవదద్భుతమైనమాయ వం
చించెనటౌట దానినికఁ జేరఁగనీయకున్నన్ను సత్కృపో
దంచితదృష్టి ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥80॥

ఉ. వట్టివిరా ! ప్రభూ సకలవైభవముల్ వెనువచ్చుమాట లీ
కట్టెకునెందుకింతమమ కారముబట్టెనొ ? దానికంటికె
ప్పట్టునగానిరానియటు త్వచ్చరణస్మరణంబుగూర్చి నీ
తట్టుకులాగు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥81॥

చ. తమ, పద దాస దాస పద దాసులదాసుడనందుగాని ని
క్కమునకు నట్టిభావమెదఁగల్గ దికేని తదున్న తాశయో
ద్యమమునొకింత నాహృదయ మందిముడింపఁగదయ్య సుస్థిరో
త్తమగుణభద్ర భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥82॥

ఉ. వ్రాసితి రామకోటి, నటు వ్రాసితినీకృతి, నద్ది, పారణల్
జేసితి నూరునెన్మిదియుఁ, జేసితిఁబట్టమహోత్సవంబు, సీ
తాసతి నీవునుంగరుణ దాల్చుటఁ జిన్నటనాటనుండి యీ
దాసునిమీఁద భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥83॥

చ. హృదయమునందు లేకఁ బర హేళనకైనను రామనామముల్
వదరినవానికే నఖిల పాపము రూపరిపోవునంచు నీ
పదయుగ భక్తులాడుటఁ యపారవిచారము దీరిపోయె హృ
త్సదనమునందు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥84॥

చ. హృదయసరోజ సంచలనమేని భవత్కృతమౌటచేత నె
య్యదిస్మరియించినన్ బలికివన్ వినినన్ గనినన్ గమించినన్
సదమలరూప ! నీవెయను స్వాంతమొసంగుము చాలుచాల్ జగ
త్సదననిదాన ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥85॥

చ. కొలిచిన సప్తవారిధులకున్ సరిపోవిల నేనుద్రావుమా
తలచనుబాలు, బూర్వమునఁ దావకదివ్యకటాక్షవీక్షణా
కలనములేని హేతువునఁ గాననికేని భవత్కటాక్షముల్
తలకొనుగాత ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥86॥

చ. తతమతి రామదాసకవి దాశరథీ శతకంబు వ్రాయుచున్
బ్రతియొక పద్యపద్యమున (పత్యమందును భ-వ) త్వత్సదనంబు
బ్రదక్షిణించి యా
ర్ద్రత హృదయంబునంగలుగ దాశరథీ ! యననో ! యటంటివు
ద్యతకృపతోడ భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥87॥

చ. సకలవిధాపచారములు సల్పెనితం డనికోపగించనెం
చక యవియెల్లనున్ బ్రకృతి జన్యగుణంబులు వీడశక్తుడ
ర్భకుఁడని సంక్షమించవలెఁ ద్వచ్చరణాశ్రయజీవితంబు సా
ర్ధకమగునట్లు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥88॥

ఉ. మానసవాచిక క్రియల మానకమే మొనరించుచుండు పా
పానికి బాచితంబుగ భవత్స్మరణంబును నీదునామసం
ధానము ద్వత్పదార్చనముఁతప్పకొసంగుము జానకీహృదా
స్థాననిధాన ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥89॥

చ. ఎవరినిబిల్తు ? నెందుజొరు ? దెవ్వరినాశ్రయణంబొనర్తు ? ది
క్కెవ? రిక నేదిమార్గము ? హరీ !! యిపుడేనెటుదప్పుకొందు దు
ర్భవదవ వహ్నికిం ? బతితపావన ! దీనశరణ్య యార్త బాం
ధవ ! పరమాత్మ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥90॥

చ. అనిశము జన్మజన్మముల యందలి నాదురితవ్రజంబు లో
ర్వనియటు వ్యాధులాధులయి పైపయిఁగ్రమ్మగ దుఃఖభాగినై
యణగిన నణ్గనిమ్ము దురితాంతక ! నాల్కకు నీదునామకీ
ర్తన గలిగించు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥91॥

చ. శమమునులేదు సత్యమను జాడయులేదు స్వధర్మమన్న ? శూ
న్యము కలికాలికప్రజల మైతగుమాయెడ జీవితక్రమం
బమృతమటంచు నాశపడమా ? విషమంచుఁ బరిత్యజించమా ?
దమితసురారి ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥92॥

చ. అల, నలసేతువున్, బదరికాశ్రమముం దిరువేంకటాచల
స్థలముఖ దివ్యదేశములు దర్శనముంబొనరించు భాగ్యముం
గలుగ దభాగ్యభాగుడను గావునఁ దత్స్మృతిమాత్రమేని నా
తలపుననిల్పు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥93॥

ఉ. శ్రీమదయోధ్యయున్ మధుర శ్రీకరమాయయు గాశి కాంచియున్
గామిత దమ్మవంతియు నఖండమహాత్మ్యము ద్వారకాపురిన్
నేమముతో భజింపగల నేరుపుజాలదు సంస్మరింతుఁ ద
ద్ధామములెల్ల భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥94॥

చ. అమితముగా నను మహర్నిశమేనొనరించు ఘోరపా
పము లడుగంటిపోవగ భవచ్చరణాశ్రయ దివ్యపాదతీ
ర్థముఁ బ్రతినిత్యముంగొనఁగ దాసునకుంఘటియింపజేయుమీ
దమితమహోఘ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥95॥

చ. సతతతమునేనొనర్చెడు నసభ్యతలెల్లను మూడుకోట్ల దే
వతలును విచ్చుఁగన్నుల నవశ్యముగాంతురు కాదటంచు నే
గతివచియింతు ? నన్కరుణఁ గాచి క్షమించుము దీనరక్షణో
ద్యతమతివౌట భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥96॥

ఉ. జ్ఞానముగల్గినన్ ఫలము గల్గదొకించుకయైనగా నను
ష్ఠానములేకయుండిన నెడంద బెడందలు డిందు నెందు శ్రీ
జాని ! భవత్పదాశ్రయుని స్వాంతమునందు భవద్గుణానుసం
ధానమునిల్పు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥97॥

ఉ. శాస్త్రవిధిప్రకార మొక సంజయువార్చగజాలనట్టి యా
నిస్త్రపుఁ సంక్షమించి కరుణించెటివేలుపెవండులేదు సూ
నాస్త్రనిభా ! భవత్సదృశుఁడౌప్రభుఁ డౌటనె ? నిన్ స్మరింతు స
ద్యస్త్రుతితాఘు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥98॥

చ. తనగతిముందికెట్లను చధర్మపథంబున ధంధనమ్మునౌ
ధనమును ప్రోగుసేయునుగదా ? కలిమానవుఁ డాత్మమోక్షసా
ధనధనమైన నీచరణ దాస్య ధనార్జనసేయలేడుగా ?
దనుజవిరామ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥99॥

ఉ. తానుగతించుమీఁద దన దారలుపుత్రులు మిత్రులాత్మసం
తానమెటుండునో యనుచెదన్ బరితాపముగాంచుగాని శ్రీ
జాని నరుండు తానెఱుగ జాలడు తానెటస్వర్గనారక
స్థానగుఁడౌనొ ? భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥100॥

చ. భువితమదౌచు స్వర్గతలమున్ భవదీయము కాకపోదు మా
ధవ ! భువనంబులన్ని యును దావకముల్ కద?యెందు నెందు నే
భవములనొందినన్ ననుభవత్పద సేవకులందెచేర్చు మ
త్యవిరళరక్తి భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥101॥

చ. వదలదుపూర్వకర్మపరి పాకపిశాచము దానికంటికె
య్యదియునుగానరాని దొకటైననుగల్గదు తావకాంఘ్రి స
త్పదనము దక్క నౌట తమదాసునకాత్మపదంబొసంగు మా
త్మద ! సతతంబు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥102॥

చ. అన్నిటియం దశక్తుఁడన టౌట సుయాత్రలు తీర్థముల్ మహో
ధ్యున్నత దివ్య దేశములు నోపికనోపి జరించలేని నా
కన్నియుఁ ద్వత్పదాంబుజస మర్హణతీర్థ మె సంఘటించు ను
ద్యన్నళినాక్ష ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥103॥

చ. నినునెదనెంచినన్, వినిన, నీదు చరిత్రముఁబాడినన్, వచిం
చినఁ గనినన్ గనుంగొనలఁ జిందముదశ్రులు గద్గదస్వరం
బును బులకల్ జనింప మనమున్ గఱగం గరుణింపుమయ్య యీ
తనువుననెప్డు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥104॥

చ. నినుమదినమ్మి కొల్చుటయె నేరమ ? నీరజనేత్ర ! నన్నుబ్రో
వను కడుభారమా ? వనట బాపి కృపంగనువాడవీవటం
చను టపచారమా ? జనకజాధిప ! దాసునిదోషరాశి నా
త్మ నిడకుమయ్య భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥105॥

చ. అహితుఁడునున్ హితుండనెడి నట్టిదెఱుంగవునీవు సర్వభూ
తహితుఁడ వైననున్ స్వపద తామరసాశ్రయులందు నిత్యస
న్నిహితుఁడవౌదు భక్తుఁడెట నిల్చిన నిల్చెదు భక్తవత్సలా !
దహర విహార ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥106॥

చ. దుఃఖమయప్రపంచమున దుఃఖముగాక మరెద్దిగల్గు ? నం
హఃఖలకృత్యముల్విడ, కహంకృతిబూని చరించునాకు ? "రా
మఃఖలు దైవతం" బనెడు మాట ధృడంబుగనిల్పు, మాత్మ నం
తః ఖచితాత్మ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥107॥

ఉ. ప్రజ్ఞయొకింతలేనికడు పాపిని నన్ను క్షమించి బ్రోచుచో
విజ్ఞుడవైన నీకరుణ విశ్రుతమైతగు లోకమందు స
ర్వజ్ఞనుతా ! త్వదాశ్రయుని బావనుజేయఁగఁబూనుమీ మహా
త్యజ్ఞత బాపి భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥108॥

ఉ. కోరుటతప్పుకాదు రఘుకుంజర త్వచ్చరణారవింద సే
వారతి గల్గుకోర్కెలవి పావనభావనలౌను గంగలో
జేరినవీ ధినీరముల చెల్వున "మానసమున్నదాక" సం
తారకనామ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥109॥

చ. భవమను పెద్దరోగ మిటు బాల్పడుటన్ జినచిన్నరోగముల్
గవిసి శరీరబాధ లధికంబుగగూర్చెడి వీనిబాపువై
ద్యవరుడుగల్గుగాని వసుధన్ భవరోగసమూలహారివై
ద్యవరుడ వీవె భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥110॥

ఉ. మంగళమౌత, మీ కెపుడు మంగళదేవతయైన సీతకున్
మంగళమౌత, లక్ష్మణకుమారునకున్, బవమానసూతికిన్
మంగళమౌత, మీశుభదమానితనామగుణాళికెప్డు స
న్మంగళమౌత భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥111॥

చ. విఖనసుసూత్రమందు బ్రభవించినయట్టి నృసింహసూరికిన్
సఖియగు నర్సమాంబికకు జన్మమునొందితి గోపకాఖ్యుఁడన్
అఖిలనియంత ! మత్పితరులందలి సద్గుణమెంచియైన నా
ర్తఖలునిబ్రోవు భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥112॥

ఉ. అన్నిటియం దకించనుడనయ్యు భవత్కరుణాభిగుప్తమై
యున్నమదీయ నవ్యకవి తోపవనంబున భక్తి సౌరభా
భ్యున్నతిమీరు చంపకము లుత్పలముల్ సమకూర్చినాడ వి
ద్వన్నుత కొమ్ము భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥ 113 ॥

చ. నరులకునెల్ల నుమ్మడిధనంబవు నీ వటుగాక సత్కవీ
శ్వరులకు గల్పభూజముగ భాసిలుచుండుట నేనుగూడ నా
వరకవితాలతాంగిని భవచ్చరణాశ్రయఁజేసితిన్ భవ
ద్వరకరుణాప్తి భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥114॥

ఉ. శాలిశకాబ్దముల్ గడువ "క్ష్మా" జ్వలనా జగజాబ్జసంఖ్య గో
పాలకవీంద్ర సంకలిత వాక్కు సుమాంచిత పద్యమాలికా
జాలము త్వత్పదాబ్జముల సన్నిధిఁజేరె గ్రహించుమయ్య సీ
తాలలనేశ ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥115॥

ఉ. నూటపదారు పద్దెములనున్ విసుగుంబడబో కొకించు కేన్
మేటికటాక్షదృష్టిఁ గనుమీ మనుమీ యనుమీ సుభద్రతో
ద్ఘాటితభద్రతన్ భవదుదారయశంబు వెలుంగగా సము
త్పాటితదోష ! భద్రగిరి దాశరథీ ! కరుణాపయోనిధీ ! ॥116॥

కం. భద్రగిరి దాశరథి కృతి
భద్రగతిం జదువునట్టి భక్తులకు శుభో
న్నిద్ర సుఖంబులొసంగును
భద్రనగనివాసి రామభద్రుండెపుడున్.

*శ్రీరామార్పణమస్తు.*

*శ్రీః శ్రీః శ్రీః*



# భద్రగిరి రామ శతకము

- శ్రీ దేవవరపు రాఘవులు

సీ. శ్రీధర ! కేశవ ! సీతామనోనాథ ! శ్రితజన మందార, శేషశయన !
నారసింహ! మురారి! నగధీర! పావన! గోవింద! మాధవ! గూఢరూప !
మధుసూదనా! శౌరి! మంజుల భూషణ! జాహ్నవీ జనక! ప్రజ్ఞాన నిలయ!
సనక సనందాది! మునివంద్య ! సజ్జన హృదయ విహార! రాకేందువదన!

తే.గీ. సర్వలోకైకనాథ ! నిగర్వచరిత !
ధారుణీవర ! వరరామ దాసవినుత !
దివ్య సుందరధామ ! దేదీప్యరామ !
భద్రగిరిధామ ! శ్రీరామ భవవిరామ ! ॥1॥

సీ. పతితపావననామ ! గతివి నీవే యంచు సుస్థిరంబుగ నమ్ము సుజనవరుల
పాదధూళిని నిఱుపేద వాడొకొన్న రీతిని గైకొందు ప్రీతితోడ
పరమ పావనమైన పాదధూళిని గాంచి జము డమితముగ తా సంతసించి
"చేరవలదు రామసేవకుండిత డని నిశ్చితాజ్ఞ నొసగు నిజభటులకు"

తే.గీ. నట్టి నీ పుణ్యపదముల బట్టుకొంటి
కాలుడే నినుగని నీరు కారిపోవు ॥దివ్య సుం॥ ॥2॥

సీ. పోతన త్యాగయ్య మూర్తీభవించిన పుణ్యద్వయమునకు పూజచేతు
గోపన్న శేషప్ప గొప్ప భక్తులకును చేయెత్తి దండముల్ చేతునయ్య
ధూర్జటి మొదలైన దోషరహితులను సంతోషమొప్ప ప్రార్థింతునయ్య
శంకర రామానుజాచార్య వరులకు దాసోహమంచును దండమిడుదు

తే.గీ. ధరను వాల్మీకి గోస్వామి ధన్యులైన
యెల్ల నిజ భక్తుల తలతు నుల్లమందు ॥దివ్య సుం॥ ॥3॥

సీ. కలియుగ వైకుంఠ నిలయమైన లలిత భద్రాచలమునందు భాసురముగ
మూలవిరాట్టువై మొదటి దైవంబయ్యు పరమశాంతంబైన ప్రస్ఫుట వద
నముతోడ లక్ష దినకరుల సురుచిర కాంతితో, భూరి గంగానదుల పు
నీత మలరి, కోటి నెలరాజుల కాంతి వెల్లివిర్సిన పండువెన్నెలనగ

తే.గీ. జానకీ లక్ష్మణాఖ్యుల సహితముగను
వెలసియుంటివి భద్రుని విన్నపమున ॥దివ్య సుం॥ ॥4॥

సీ. పతిత పావనులైన ప్రహ్లాద నారద హనుమాంబరీషార్జునాదిభక్త
వరులకు, వాల్మీకి వందనీయులయిన వ్యాస శుకాది మహర్షులకును
కవిగుల గురువైన కాళిదాసాది, సు కవి వరులకును సాకల్య మొప్ప,
గణపతి భారతీ ఘనమూర్తులకు నెల్ల రామభక్తులకును ప్రేమతోడ

తే.గీ. నంజలి ఘటింతును హృదయానంద మొప్ప
మానవ ప్రగతి గాములీ మాన్యులనుచు ॥దివ్య సుం॥ ॥5॥

సీ. శ్యామసుందర రామ ! సర్వభూతాత్మక సాధుజనావన ! శరణు శరణు
సాదరమునిజన ! సర్వలోక శరణ్య ! సాయుజ్య వరదాత ! శరణు శరణు
శాశ్వతానంద ప్రశాంత పాదకమల ! విశ్వేశ్వర ప్రణుత ! వినుతి వినుతి
విశ్వ విదూర ! వివేకధీర ! బ్రహ్మ విద్యా ప్రదాయక ! వినుతి వినుతి

తే.గీ. విశ్వజనక ! పోషక ! హరీ ! విశ్వ వేద్య
చారుభూషణధార సౌజన్యగార ॥దివ్య సు॥ ॥6॥

సీ. సౌభాగ్య మెవ్వడు సౌజన్య మెవ్వడు ? సౌశీల్య మెవ్వడు సత్త్వమెవడు
వరమేష్టి యెవ్వడు ప్రజ్ఞాని యెవ్వడు పరమాత్ముడెవ్వడు ప్రాజ్ఞుడెవడు ?
సాకారుడెవ్వడు సర్వంభరుడెవడు సద్రూప మెవ్వడు భద్రమెవడు ?
మృత్యుంజయుడెవడు మితిరహితు డెవడు ప్రాకృతమెవ్వడు ప్రాప్తమెవడు?

తే.గీ. అన్నియును నీవుగాకున్న యన్యుడెవడు ?
"విన్నపములు" గైకొనవె ప్రసన్నవదన ॥దివ్య సుం॥ ॥7॥

సీ. రామనామ మనెడు రమ్య విత్తనమును హృదయ మాన్యమునందు పదిలపఱచి
"చింతనం" బనునట్టి జీవనంబును పోసి కపట మోహములను కలుపుతీసి
"సంకీర్తనం" బను సారమెల్లను వేసి వగలు పగలనెడు తెగులు తీసి
"సాధన" యనెడు ప్రశాంత శాఖనిచేసి వందనం బను మేలు పండ్లు కోసి

తే.గీ. భుక్తి చేసిన వానికే ముక్తిగల్గు
సర్వశాస్త్ర సారంబిది చర్చచేయ ॥దివ్య సుం॥ ॥8॥

సీ. నిష్కామబుద్ధితో నిశ్చల మతితోడ కామ్యకర్మల జేయ కలుషమడగు
నన్నార్తులను పిల్చి యాదరంబును చేయ దీనబాంధవుడు సంతృప్తిచెందు
బీదసాదలగాంచి ప్రేమతో బరికింప శౌరి మనంబున సంతసించు
బాధితులను జూచి భావముప్పొంగుచు సాయము చేసిన చక్రిమెచ్చు

తే.గీ. సాటినరులపై యించుక జాలిలేని
దుష్ట జనులకు దైవము దూరమగును ॥దివ్య సుం॥ ॥9॥

సీ. గంగలో స్నానము గడియ గడియకు తా చేసిన పోవునే చేసినట్టి
పాపము తననీడవలెను దయను గల్గి విడువక వెంటాడు పెనుపిశాచి
పాపకర్మము తాను పగబట్టిన విష నా గు వలెను వెంటాడు గుర్తు తెలియ!
పాప మొకపిడుగై పరుగుతో వచ్చి పై బడును. తలచ పాపఫలము ననుభ

తే.గీ. వించకను తప్పునే ? యావిరించికైన ?
పాపరాహిత్యమే సుమ్మి పరమపథము ॥దివ్య సుం॥ ॥10॥

సీ. దివ్యమౌ గంగానదీమతల్లి పరమ పావనమైనట్టి బ్రహ్మపుత్ర
జీవనాధారమౌ కావేరి, సీలేరు, గౌతమీ, మందర, కృష్ణవేణి
యింద్రావతి, శబరి యింపైన ప్రణహిత తపతి, యమున, నర్మదయును పెక్కు
జీవనదుల ధరించిన ధన్య భారత జనని కడుపునందు జన్మ మొంద

తే.గీ. పూర్వజన్మ ఫలముగావె ? పుడమిలోన
భారత జనని కంటెను స్వర్గమేది ? ॥దివ్య సుం॥ ॥ 11 ॥

సీ. రామ! శ్రీరఘురామ! రాజేంద్ర ఘనరామ! రావణాంతక! రణ రంగ భీమ!
రామ! సీతామనోధామ! రాకేందు, వదనరామ ! కౌసల్య తనయ రామ !
రామ! దుష్టజనవిరామ! కోమల నీల వర్ణ! సుగుణ ధామ! భవవిరామ !
రామ ! దైవలలామ ! ప్రేమసాగరధామ ! దశరథాత్మజరామ ! దైవనామ

తే.గీ. రామ ! రామ హరేయంచు రామ ! రామ !
నిన్ను మనసార ప్రార్థింతు నీతిధామ ! ॥దివ్య సుం॥ ॥12॥

సీ. స్మృతులు, శ్రుతులు, మంచి మతభావములును పురాణముల్, భాష్యముల్, రాజహంస
గురువులు, యోగులు, గూఢశాస్త్రములెల్ల ముక్తిమార్గము జూపె శక్తి మేర
తాడి నెక్కెడు వాని తను పట్టుకొని, త్రోయగల వారెవ్వరు ? జగతియందు
త్రాళ్ళు నిచ్చెనదెచ్చి ధైర్యముతో ప్రాకు పూతాత్ముల వరించుముక్తికాంత !

తే.గీ. గట్టి నమ్మకమున్నచో కానిదేది ?
పురుషయత్నము లేకున్న ముక్తిరాదు ॥దివ్య సుం॥ ॥ 13 ॥

సీ.గీ. ఏ పేరు పెట్టి నిన్నేమని పిలతునో తోచదాయెను నాకు తోయజాక్ష !
ఏ రూపమని యెంచి కారుణ్యసాగర ! యేరీతి నూహింప నెఱుక రాదు !
ఏ గుణంబులతోడ నిమిడియుంటివొ గాని నిర్గుణాత్ముడ వీవు నిజమ సుమ్మి!
ఏ లీలతోడ నీ యెల్ల జగములను పాలించుచుంటివో పద్ధతెఱుగ !

తే.గీ. మాటలకు నెల్ల బుద్ధికిన్ మనసునకును
తెలియరాని నీ మహిమనే తెలియగలన ? ॥దివ్య సుం॥ ॥ 14 ॥

సీ. మానవసేవయే మాలక్ష్యమంచును చరియించు జనులకు స్వర్గమమరు.
మాధవస్మరణమే మావిధియంచును భావించు నరులకు భాగ్యమమరు.
మాధవసేవయే మా వృత్తి యంచును సేవించు ప్రజలకు సిద్ధియమరు
మాధవ శ్రవణమే మాకృత్యమంచును తపియించు వారికే తత్త్వమమరు.

తే.గీ. మాధవుని సఖ్యమే మాకు మంచిదనుచు
తలచు భక్తుల కెప్పుడు దైవమమరు. ॥దివ్య సుం॥ ॥ 15 ॥

సీ. నీ ఘనతత్త్వమున్ నెఱుగ లేకనే నింతకాలము చాల చింతబడితి
తెలిసె నీ నిర్మల దివ్యతత్త్వము నాకు చింతలన్నియు నేడు హంతమాయె
కలిగెనీ పావనకరుణామృతము చూడ దేహాంతరంబెల్ల దీపమాయె
నాలో వెలుగులందు హాయిగా నినుగాంచ విద్యుల్లతాశోభ వెల్లివిరిసె

తే.గీ. జన్మజన్మల నుండి నా జడములెల్ల
తొలగె నేటితో నీవల్ల కలుషహరణ ॥దివ్య సుం॥ ॥ 16 ॥

సీ. గ్రామ జీవితము నిష్కామయోగ సమము పుర జీవితంబెల్ల నరక సమము
కరుణ వినయము సుస్థిరముగ నెలకొన్న పల్లెవాసులు మంచి భాగ్యవంతు
లంచును నీ మదినెంచి పూజింతును మించు వేడుకతోడ నెంచి యెంచి
మోసము దంబము పూర్తిగా యెఱుగని "పల్లెలే భూతల స్వర్గమరయ"

తే.గీ. నట్టిపల్లెలో బ్రతుకుట హాయియంచు
నెంచి పర్ణశాలను నివశించినావు ॥దివ్య సుం॥ ॥17॥

సీ. అంతరాత్మను జూడ నలవికాకున్నను తెలుసుకొనిన చాలు తొలగుకర్మ
కర్మ తొలగిన నిష్కామ కర్మలు చేసి చేసి జీవాత్మలో చేరియున్న
నివురును తొలగింప నీతి నిష్టలు గల్గి రేపవలు ఘనమౌ రీతులెఱిగి
రామ తారకమంత్ర రాజమున్ గైకొని చింతచేయ తెలియు నంతరాత్మ

తే.గీ. ఆత్మను తెలుసుకొన్న పుణ్యాత్ములెల్ల
ముక్తిగాంచు ముమ్మాటికిన్ ముదముగల్గి ॥దివ్య సుం॥ ॥18॥

సీ. శ్రీరామ జయరామ సీతాపతేరామ శృంగార రామ ప్రసిద్ధరామ
శ్రీరామ గుణధామ క్షితిజా మనోధామ సృష్టి మూలాధామ పుష్టిధామ
శ్రీరామ జనకామ శ్రీకాంత నిజకామ ధరకామకోటి కందర్పకామ
శ్రీరామ నిజనామ శ్రీకార భవనామ పతితపావననామ ప్రాజ్ఞనామ

తే.గీ. "రామ శ్రీరామ రామ" సలలిత చరిత
ధామ, నిన్ను పూజింతునా దైవమనుచు ॥దివ్య సుం॥ ॥19॥

సీ. సకల స్రవంతులన్ సాగరమును జేరు భంగి మతములెల్ల భక్తితోడ
భగవానునే జేరి సుగతి గాంచును, చూడ "దైవస్థితిని తెల్పు ధరను మతము"
మతము కంటెను లెస్స మానవత్వంబున్న దేవుడు గలడు సందేహ మేల ?
సకల మతములకు సర్వేశ్వరుండగు "భగవంతుడొక్కడే భావమెఱుగ॥

తే.గీ. మతకలహములందు నరులు మరణమైన
వారి కంటెను పశువులు వసుధగలర ? ॥దివ్య సుం॥ ॥ 20 ॥

సీ. బ్రహ్మవై విష్ణువై ఫాలలోచనుడవై రాముడవయ్యు రహీమువయ్యు
క్రీస్తువై గోపికా కృష్ణుడవయ్యును బుద్ధుడవై పరిశుద్ధమయ్యు
త్రివిధ మతాచార్య దివ్యబోధలలోన భాసురంబౌ యేకభావమయ్యు
శ్రీకార నిలయమై శ్రితజన కల్పమై వెలయు నిన్నేమని పిలువగలను ?

తే.గీ. సృష్టినెల్లను నీవు పోషించుచుండ
కడుపుకై నేను కక్కుర్తి పడగనేల ? ॥దివ్య సుం॥ ॥ 21 ॥

సీ. కాలమా స్వల్పము కాయమా నిలువదు ధనమా నశించును తఱగు యశము
నాయువా తక్కువ ప్రాయమా పతనము వైభవమా చెల్లు వరుసగాను,
బుద్ధియా నిలువదు శుద్ధియా మృగ్యము సత్యమా తెలియదు చక్కగాను
భక్తియా కుదరదు, యుక్తియా పూజ్యము ధర్మమా యెఱుగను దాని విలువ

తే.గీ. యింకెటులను ముక్తి లభించు పంకజాక్ష !
జగతి నావంటి మూర్ఖుడౌ జనుడు లేడు ॥దివ్య సుం॥ ॥ 22 ॥

సీ. పగబట్టి బిగబట్టి "ప్రారబ్ధ కర్మము" పట్టిలాగుచునుండె గట్టిగాను
పొంచుకొనుచు వచ్చె "సంచిత కర్మము" దుష్టాత్ముడైనట్టి దొంగవలెను
పడుగెత్తుకొనివచ్చె భయమైన యాగామి బూకరించెడు పెద్దభూతమనగ
కర్మఫలం బింత కరణా రహితమని తెలియజాలక చేసి తులువపనులు

తే.గీ. నరక యాతనతోడనే నలుగుచుంటి
నన్ను రక్షింపవయ్య యనాథనాథ ! ॥దివ్య సుం॥ ॥ 23 ॥

సీ. ఘన యశోధనుడు రాఘవుని స్మరణచేయ తొలగును పాపపంకిలము. దురిత
జనవిదూరుండైన జానకీ రాముని చింతనంబును చేయ చెడును కర్మ
కరుణాత్ముడైనట్టి కౌసల్య తనయుని సఖ్యంబుగోరిన సమయు జన్మ
దేవదేవుండైన దినరాజ వంశీయు జపియించగల్గును జయముసుమ్మి

తే.గీ. యనుచు లెస్సగా కీర్తింతు వినుతశీల
వేగకాపాడవే నన్ను విమలతేజ ॥దివ్య సుం॥ ॥ 24 ॥

సీ. సుర విరోధుడు వచ్చి శ్రుతుల గొంపోవ విచారించు బ్రహ్మను సాకినావు
గజరాజు మొఱవిని కడుగాభరాచెంది పరుగున వెళ్ళి కాపాడినావు
భర్తశాపము చేత బండయై పడినట్టి యింతికి బ్రతుకు కల్గించినావు
దీనవదనయైన మానిని పాంచాలి పిలుపువిని పరువు నిలిపినావు

తే.గీ. యెన్నని వివరించగలను సన్నుతాంగ
వేదనాత్ముల బ్రోచుటే వృత్తి నీకు ॥దివ్య సుం॥ ॥ 25 ॥

సీ. నీవెంతటి మహిమాన్వితుడవో వాసుకి వాసవుడు శ్రుతులు వనజభవుడు
ఫాలలోచన భవ్యపరమాత్మ రూపులే తెలియజాలకవారు తికమకల్ ప
డగ నికనావంటి డంబజీవికి, నీతి హీనునకును దుష్ట మానసునకు
దురిత చరితునకు పరధనాపేక్షకు బానిసనై చచ్చి బ్రతుకుచున్న

తే.గీ. వానికి పరాత్పరుండవౌ పావనుడవు
నిన్ను తెలియతరముగాదు నిగమవినుత ॥దివ్య సుం॥ ॥ 26 ॥

సీ. అన్న దుర్మదుడు నా విన్నపములను మ న్నించని నీచుడు నిజమరయని
లోకభీకరుడు విశ్లోకుడు రావణ నామధేయుడు తాను రామ నేను
నిజము వచించితి నిఖిలలోక శరణ్య ! శంకరార్చిత పద్మచరణ యుగళ !
నన్ను మన్నించ వే నాతండ్రి యనుచు వి భీషణాఖ్యుడు దీన భాషణములు

తే.గీ. సవినయమున జేయుచు నిన్ను శరణు వేడ
నభయ మొసగి బ్రోచితివి నీ విభవమలర ॥దివ్య సుం॥ ॥ 27 ॥

సీ. నీ దివ్యగుణములు, నీ ప్రవర్తనమును, నీ విమలంబైన నిధినిధాన
మునుగాంచి సౌమిత్రి ముదమారగను నిన్ను చేరి దాస్యము చేసి సిద్ధిబడసె
నిత్య వ్రతంబైన నీ శరణాగత త్రాణ పరాయణత్వమును తెలిసి
నీఘోర రిపునకు నీ సోదరుడగు, విభీషణుండును నీవు విష్ణువనుచు

తే.గీ. వినుతి చేసి శరణుకోరి వృద్ధిగాంచి
లంకకు ప్రభువై జీవించె లలితగతిని ॥దివ్య సుం॥ ॥ 28 ॥

సీ. రావణ సార్వభౌమా విన్ము రాముడు సాక్షాత్తు విష్ణువు శత్రుకోటి
నెల్లను పరిమార్చ నిలమాన వావతా రుండయి భీమకోదండమున్ క
రమున ధరించి విద్రావణంబై నట్టి రామ బాణము దాల్చి రామమూర్తి
నిలుచుండ నీవును నిటలాక్షుడును వచ్చి రణరంగమందున రామబాణ

తే.గీ. ధాటి కెదిరించి నిలువగ తరము గాద
నుచు విభీషణాఖ్యుండును, నుడివెసుమ్మి ॥దివ్య సుం॥ ॥ 29 ॥

సీ. ఏకకాలమునందు లోకేశు డీశుని కోటిలింగములకు కూర్మితోడ
పూజ సల్పినయట్టి పుణ్యాత్ముడై యుండి కమలాక్షు నెదిరించు కారణమున
రావణుండు పరమ రాక్షసుండాయెను వేద విజ్ఞానపు విధమెఱిగియు
పరనారిపై మోజు పడినందులకు తాను పతనమందియు తన ప్రజలనెల్ల

తే.గీ. పతనమునకు పాల్జేసిన పాపి యాయె
వలదు పరభామ లందున వలపుమాకు ॥దివ్య సుం॥ ॥ 30 ॥

సీ. నీ బలాబలములన్ నిర్ణయించుటకు, సుగ్రీవుడు సల్పె పరీక్ష నీకు
సప్తతాళము లొక్కసారిగ ఘోరమౌ నిశిత బాణహతిచే నేలగూలె
సప్తతాళము లొక్కసారిగ లెక్కయా సప్త విశ్వములెల్ల తప్తమగును
నీనారి సారింపు నిజముగా చేసిన భూతరాశంతయు భీతి చెందు

తే.గీ. యిట్టి జగదేక జెట్టిన యెఱుగ లేక
వదరుచుందురు మూర్తులు పరముమఱచి ॥దివ్య సుం॥ ॥ 31 ॥

సీ. రహదారిలో జాతి రత్నము పడియుండ కళ్ళుండి కానడు కఠిను డొకడు
కళ్ళుండి యెటులైన కనిన విలువ లేని గులకఱాయంచును తలచునతడు
రత్నమని తెలిసి రస హృదయుడు తీసి లక్షలను గడించు లాఘవముగ
రామనామము మేలిరత్నమై రంజిల్ల గులఱాయనుకొను గ్రుడ్డివాడు

తే.గీ. రామనామామృతమనెడు రత్న కాంతి
గాంచి మసలుచున్నప్పుడే కల్గు ముక్తి ॥దివ్య సుం॥ ॥ 32 ॥

సీ. దాన వ హృదయులు మానాభి మాన రహితులు దుర్మదులును మతి రహితులు
ధనమదాంధులు బంధుజన మిత పుత్రకళత్ర భృత్యాదుల గాత్ర గాన
శ్రవణ పరవశులున్, శాంతి రహితులును, గర్వాంధులౌ యహంకార
భావనోద్వేగ పరులును, విద్వత్తు రహితులున్ వినయ, కరుణ, వివేక నయ రహితు

తే.గీ. లున్, బుధజనాపకారులున్, లుబ్ధులు, పెను
మలల రీతిగ నిన్నెట్లు తెలియగలరు ? ॥దివ్య సుం॥ ॥ 33 ॥

సీ. అజ్ఞాన తిమిరాంధులై మతద్వేషమున్ వెదజల్లు కుటిల ప్రవృత్తి కల్గి
చరియించు నరులకు నరకమే సిద్ధము. పయియెగ్గులన్ పన్ను ఖలులు కనుక
మతసహనరహితుల్ మౌఢ్య చిత్తులుగాన పరమ పాపాత్ముల దరికి జేరు
మతమున కొక్కడై మహి మాన్వితుండగు దైవము వేరుగ తాను లేడు

తే.గీ. అఖిల జీవులు పరమాత్మ యంశయైన
యిలను వేరు వేరుగ దేవుడెందుగలడు ? ॥దివ్య సుం॥ ॥ 34 ॥

సీ. తల్లివి ! మాతృ వాత్సల్య కృపా పల్కు తేనెల తీపి నందించవేమి ?
తండ్రివి ! నేజెయు తప్పులెల్ల మఱచి మంచి మార్గమున మళ్ళించవేమి ?
గురుడవు ! నాదు దుర్గుణములు తొలగించి దేవాక్షరములు దిద్దించవేమి ?
ప్రాణసఖుండవు ! పరమాత్మ కృపగల్గు ప్రియ విధానమును జూపించవేమి?

తే.గీ. యెంచుకొంటి ప్రభువుగ పాలించవేమి ?
విష్ణుదేవుడవీవు దీవించ వేమి ? ॥దివ్య సుం॥ ॥ 35 ॥

సీ. పరిపూర్ణ శాంతి నీ పాదార్చనమువల్ల ధరణిలో గల్గును తథ్యముగను
సంపూర్ణ సుఖము నీ సన్నిధినే గల్గు వేఱెచోటను లేదు వెదకి చూడ
నాణ్యమౌ నడవడి నల్గురు మెచ్చంగ కల్గును నీదు కైంకర్యమందు
నిండైన సంతృప్తి నీ నామ జపమున సిద్ధించు తప్పక చిత్తమందు

తే.గీ. భుక్తి సమకూరు నీ పాద పూజ వలన
ముక్తి కలిగించు నీ సేవ భక్తులకును ॥దివ్య సుం॥ ॥ 36 ॥

సీ. నవమాసములు మోసి నానా శ్రమలకోర్చి కని, పెంచి లాలించు కన్నతల్లి
కొండంత కోర్కెతో కోటి బాధలు పడి తన సంతతిని పెంచుతండ్రి సుమ్మి
సర్వ విజ్ఞానము సానుకూల్యముగను ధారపోసి గురుడు ధన్యుడగును
తన ప్రాణముగనెంచి తారతమ్యము లేక నుపకార బుద్ధితో నుండు హితుడు

తే.గీ. పైన పేర్కొన నల్గురు పావనమగు
దైవసములుగాదె ? కనగ దైవరాయ ! ॥దివ్య సుం॥ ॥ 37 ॥

సీ. ప్రేమను నెలకొల్ప ప్రీతితో జగమున యేసుక్రీస్తు బలియయ్యెనుగద యల
బానిసత్వము పటాపంచ లొనర్చగా యబ్రహాం లింకను, యసువులొదిలె
భారత జాతికి భాగ్య ప్రదాతయౌ గాంధి మహాత్ముడు ఘనతగాను
మతసామరస్యమే మా దేశ సౌభాగ్య మంచును చేసె ప్రాణార్పనంబు.

తే.గీ. విశ్వ మానవ కళ్యాణ వృత్తి కొఱకు
పుట్టునా ఇంకనిటువంటి పుణ్యత్రయము ॥దివ్య సుం॥ ॥ 38 ॥

సీ. రామ నీ నామ తారకమంత్ర బలముచే ఘోర పాపగిరుల కూల్చవచ్చు
రామ నీ నామ తారకమంత్ర బలముచే స్థిరమైన సంపదల్ చేరవచ్చు
రామ నీ నామ తారకమంత్ర బలముచే పుణ్య లోకములను పొందవచ్చు
రామ నీ నామ తారకమంత్ర బలముచే వైకుంఠ వాసము బడయవచ్చు

తే.గీ. నీదు తారక మంత్రము నిర్మలాంగ
నన్ను చూపించు ముద మొప్ప నిజముగాను ॥దివ్య సుం॥ ॥ 39 ॥

సీ. మతము మతములంచు మనుజుల మతులను చెడగొట్టు వాడుతా చెడును సుమ్మి
మతము నందేముండె ? మనిషికి మనసున్న చో సర్వ మతములు సుఖ ప్రదములు
మానవత్వముమీద మమకారముడిగిన స్వంతమతము కూడ శత్రువగును
సంకుచితమయిన స్వార్ధపరత్వమౌ మత విధానములు దుర్మార్గులకును

తే.గీ. నిలయములటంచు బుద్ధితో తెలియ వలయు
మంచి మనసుకంటెను గొప్ప మతములేదు ॥దివ్య సుం॥ ॥ 40 ॥

సీ. క్రీస్తు బుద్ధుడు గాంధి వాస్తవముగ నుద్భవించిన ధన్యమౌ పృధ్వియిదియె
శంకర రామానుజాచార్య వర్యులు పుట్టిన దివ్యమౌ పుడమియిదియె
యనఘుడై నట్టి మహమ్మదు వెలసిన స్వర్గసమానమౌ వసుధ యిదియె
పోతన త్యాగయ్య పుణ్య కవీంద్రులు జన్మమొందిన భక్తి జగతి యిదియె

తే.గీ. అట్టి సుగుణులు వెలసిన యిట్టిధరను
మసలుచుండెను హీనతన్ మనుజుడెపుడు ॥దివ్య సుం॥ ॥ 41 ॥

సీ. శరదిందు వదనుని శరణు కోరిననాకు కాలపాశము దరికేలవచ్చు?
బృందారక వినుతున్ డెందమందున నిల్పు నాకు దుర్భరమైన నరక మేల?
యిందిరా ప్రియునకు వందనం బిడునాకు చిత్రగుప్తుని చెత్త పత్రమేల ?
వేదండ వరదుని వేడుకొనెడు నాకు కాలకింకరులచే గోలయేల ?

తే.గీ. భక్త చందనుని కొలుచు వారికెపుడు
ముక్తి కుందన మఱచేత మొలుచునయ్య ॥దివ్య సుం॥ ॥ 42 ॥

సీ. ఇలను బ్రతుకుచున్నను బది యేనాలుగు లక్షల జీవకోట్ల నరజన్మ
ముత్త మోత్తమమని నుడివిరిగద నీతి వేత్తలు వేదాంత విదులు పెక్కు
శాస్త్ర పరిజ్ఞాన స్రష్టలు విజ్ఞాన మూర్తులు మునులు దైవార్తులెల్ల
కాని నేడు నరుడు కళ్ళు మూసుకుపోయి మత్తుడై భ్రష్టుడై మందుడగుచు

తే.గీ. నుత్తమ నరజన్మ విలువను చెత్తచేసి
రెండు కాళ్ళ పశువుగ వర్తించుచుండె ॥దిద్య సుం॥ ॥ 43 ॥

సీ. పార్వతీనాథుండు పరమ నిష్టను కూడి పఠియించు మంత్రమే పావనంబు?
శారదా నాథుండు తీరిక లేకుండ పఠియించు మంత్రమే పావనంబు
దేవతా నాథుండు కావవే యనుచును పఠియించు మంత్రమే పావనంబు
యష్ట దిక్పాలకుల్ నిష్టతో తామెల్ల పఠియించు మంత్రమే పావనంబు

తే.గీ. అట్టి మంత్రమే నీనామ మవనియందు
రామ మంత్రమే భువికి శ్రీరామరక్ష ॥దివ్య సుం॥ ॥ 44 ॥

సీ. పెట్టని కోటగా పృథ్వి కెల్లను మహోన్నతమౌ హిమాలయ నగములుండ
త్రవ్వకున్నట్టి గడ్తలు మూడు జలధులు మూడు దిక్కులలోన మొలచియుండ
ప్రాణాధికముగను పావన భారత మాతను ప్రేమించు మనుజులుండ
జగతిలో స్థిరమా ప్రజాస్వామ్య ప్రియులైన మంచివారిందు జన్మించియుండ

తే.గీ. ప్రాణ మర్పించు వీర సిపాయిలుండ
నిట్టి దేశమాతకును సాటెందుగలదు ? ॥దివ్య సుం॥ ॥ 45 ॥

సీ. నిజమైన దేవిని నిష్టలో చూచె ప రమ హంసయైనట్టి రామకృష్ణ
గాంచెను మఱి వివేకానంద శిష్యుడై, నిర్మల భక్తులు నేడరయగ
రామతీర్థయును మీరాబాయి గాంచిరి కృతకృత్యులై తాము కృష్ణదేవు
పోతన త్యాగయ్య పుణ్య చరితులయ్యు రామదేవుని గాంచె రమ్యమొప్ప

తే.గీ. తానీషాయును చైతన్య ధన్యులైరి
దైవ మెఱుగు వారెందఱో ధరనుకలరు. ॥దివ్య సుం॥ ॥ 46 ॥

సీ. మృగములు చచ్చినన్ మేదిన యందున వాటి చర్మములకు వచ్చె విలువ
పశువులు చనిపోయి పాదరక్షలుగాను సేవ చేయుచునుండె చింతలేక
మనుజులు చావగా మహిలోన శవములు చిల్లి గవ్వకు కూడ చెల్లవాయె
మనుషులు బ్రతికుండి మంచితనము వీడి సేవచే కొందురు సిగ్గులేక

తే.గీ. మానవత్వమును మఱచి మనుగడలను
చాల హాయిగా గడుపు చండాల నరులు ॥దివ్య సుం॥ ॥ 47 ॥

సీ. అవనీ తనయ మనోహర ! నిను కీర్తింతు శాంతము దయచేయ సవ్యమగును
నవనీత హృదయ ! నే నమ్మినాడను నిన్ను భవ వినాశము చేయ సత్యమగును
నవవికసిత పద్మనయన ! నిన్నే నమ్ము కొంటినన్ మఱచిన ఘోరమగును
భువనైక మోహన ! బుద్ధితో పూజింతు రక్షించవే వేగ రావలయును

తే.గీ. విందు వట దీనుల మొరలు వినుతి సేయ
సంచితము లెడబాపి దీవించుమమ్ము ॥దివ్య సుం॥ ॥ 48 ॥

సీ. స్వార్థస్వభావము సహజమే యైనను జాతి సుస్థిరతకై నీతిపరులు
ఖండించవలయును నిండు మనసుతోడ దేశహితము వారి దీక్షగనుక
"సొంతలాభపు దృష్టి" సుంతైన విడువక నంతయున్ తనదంచు పంత మొంది
లేమి జనుల మాట లేశమైన వీడి కోటపై కోటలు వాటముగను

తే.గీ. కలుపుకొనుచును మసలెడు తులువ జనులు
దేశద్రోహులంచును నేడు తెలియవలయు ॥దివ్య సుం॥ ॥ 49 ॥

సీ. శృంగార రామ ! నీ సేవకుడను నన్ను కరుణించ తగునయ్య కాపుగాచి
కళ్యాణరామ నీ కనుసన్నలందుంటి రక్షించ తగునయ్య రమ్య మొప్ప
కారుణ్య రామ ! నీ కైంకర్యమును చేస్తి మోక్ష మొసగవయ్య ముద్దుగాను
లాలిత్య రామ ! నీ లక్షణములు దెల్సె జాలితలచవేమి బాలుడంచు

తే.గీ. రామ రామా యనుచు నేను ప్రేమతోడ
నీమ మొప్పుచు పిలతును కామజనక ॥దివ్య సుం॥ ॥ 50 ॥

సీ. తన మనమును తాను కనలేదు కనలేని చిత్తమున్ లేదంచు చెప్పదగునె ?
మనసు కంటెను బుద్ధి మాలిన్యమై యుండు బుద్ధి మనసుకును బుద్ధి చెప్పు
బుద్ధి చెప్పిన రీతి పూని కృత్యములను చేయుచుందురు గద శీఘ్రగతిని
చూడంగ బుద్ధియున్ సుంత కనబడదు బుద్ధియు లేదంచు మొత్తముగను

తే.గీ. చెప్పవీలు లేదాయెను, గొప్పదైన
తత్త్వ శాస్త్రపు లోతులన్ తఱచవలయు ॥దివ్య సుం॥ ॥ 51 ॥

సీ. మనసు బుద్ధియు లేని మనిషి యెందునలేడు బుద్ధి కంటెను చాల ముఖ్యమైన
దైవాంశ సంపూర్ణ జీవాత్మ రూపమై చైతన్య వంతమై సవ్యగతిని
వెలుగుచుండెను మానవుల దేహమందున "పరమాత్మ తరపున ప్రతినిధి యగు
జీవాత్మ" లేదన్న జీవనమే సున్న దేహమందున జీవి దృక్కులకును

తే.గీ. గోచరము కాదు కనుక నగోచరమగు
పరమ పురుషుడు లేడన్న పాడికాదు ॥దివ్య సుం॥ ॥ 52 ॥

సీ. మేల్మి బంగారము మితిమీరియున్నను కలిమితో యిల్లంత కలిగియున్న
సస్యముల నొసగు చాల పొలములున్న వశ్యమై మంత్రముల్ వందలున్న
పేరుకీర్తులు చాల పెద్దవై యున్నను పరమసామ్రాజ్యాధి పదవియున్న
సౌఖ్యము కలుగునే ? శాంతము లేకున్న శూలికైనను వనమాలికైన ?

తే.గీ. శాంతహీనుల బ్రతుకులు జాడలెరుగ
హంతకుల మనసువలె తానలమటించు ॥దివ్య సుం॥ ॥ 53 ॥

సీ. నిండు చూలాలైన నెలతయగు కడు సౌశీల్యవతి పునీత సిరికి మారు
రూపయోనిజ భవ్యరూపలావణ్య విఖ్యాత చరిత, జన కసుత పరమ
పావనోపేత, యపార దయావతి నిందించ తరమౌన నిష్కళంక
నట్టి సీతామాత నడవికి పంపించ మనసెటు లొప్పెను మానవేంద్ర

తే.గీ. వేలుపెట్టి చూపించగ వీలులేని
రీతి ప్రజలనేలు ఘనవిఖ్యాతినీది ॥ దివ్య సుం ॥ ॥ 54 ॥

సీ. పురుషోత్తము డెవడు పూజ్యు డెవడఖిల జీవాత్ముడెవ్వడు దేవుడెవడు ?
నిష్కళంకుడెవడు నీతి యెవడు, దాన ధర్మవేత్తయెవడు, మర్మమెవడు ?
సౌఖ్యమెవడు శుద్ధ సౌమ్యమెవడు, సదా సత్సంగ మెవ్వడు సారమెవడు ?
సాయుజ్య మెవ్వడు సంపూర్ణ మెవడు ? సర్వజ్ఞుడెవ్వడు శౌచమెవడు ?

తే.గీ. అన్నియును నీవుగాకున్న యన్యుడొకడు
లేడు లేడంచు చాటెదన్ లెస్సగాను ॥దివ్య సుం॥ ॥ 55 ॥

సీ. ఎవ్వాని దయచేత నెల్ల విశ్వంబులు జన్మించి మనుచుండె సక్రమముగ
నెవ్వాని కరుణచే యీ భువియెల్లరె కలసిపోయి మెలగు క్రమముతోడ
నెవ్వాని భీతిచే నెల్లలోకంబులు లయమయి వెలయును లక్షణముగ
నెవ్వాని యాజ్ఞచే నెల్లజీవులు తాము పుట్టుచు గిట్టుచు పొరలుచుండు

తే.గీ. నట్టి ప్రభువైన నీవు సహజ మలరుచు
వెలసియుంటివి వైకుంఠ నిలయమందు ॥దివ్య సుం॥ ॥ 56 ॥

సీ. నిత్యమౌ శుద్ధమౌ సత్యమౌ బుద్ధమౌ దేవుని తేలికన్ తెలియవశమె ?
నిర్వాణపథమౌ సునీత చారిత్రమౌ దేవుని తేలికన్ తెలియతరమె ?
సర్వాత్మ రూపమౌ శాంతమౌ సవ్యమౌ దేవుని తేలికన్ తెలియనగున ?
నిఖిల కారణమౌ సునిశిత ప్రజ్ఞానమౌ దేవుని తేలికన్ తెలియబడున ?

తే.గీ. నిర్గుణమ్ము నిరంజన నిలయమయము
దైవతత్త్వము నెఱుగ నీ తరముగాదు ॥దివ్య సుం॥ ॥ 57 ॥

సీ. భావసమైక్యత ప్రాణప్రదము సుమ్మి జాతి పురోగతి ఖ్యాతిపొంద
దేశ పురోగతి తేజరిల్లగ జేయ భాషా సమైక్యత పట్టుగొమ్మ
మత సమైక్యత మంచి మానవత్వమునకు "జీవమొసగెడు సంజీవి సుమ్మి"
దేశ సమైక్యత దీటైన సుగుణము సహజీవనంబు ప్రశాంతి నొసగు

తే.గీ. భాష వేఱైన నేమైన భావమొకటె
మతము వేఱైన నేమైన మనిషి యొకడె ॥దివ్య సుం॥ ॥ 58 ॥

సీ. వనమాలి మెడలోన వరుసగాను నవగ్రహములు తిరుగుచుండు నహరహంబు
గ్రహములు కనిపించు కాని గ్రహాంతర సూత్రము నెవ్వడు చూడగలడు ?
గ్రహము గ్రహము మధ్య గట్టిగా బిగిసిన "సూత్రాత్మ" నెవ్వడు చూడగలడు?
వందలాదిగ నున్న ప్రసరములను రైతు గట్టి పగ్గముతోడ కట్టుభంగి

తే.గీ. సృష్టిలో నవగ్రహములన్ చిత్ర మొప్ప
కట్టివేసిన జగదేక దిట్టవీవు ॥దివ్య సుం॥ ॥ 59 ॥

జ్ఞాన మార్గముతోడ జన్మ రాహిత్యమున్ పొందగలనటంచు పూనియుంటి
బ్రహ్మమనగనేమొ ? భ్రాంతి యనగ నేమొ ? మర్మ మెఱుగలేక మథనపడితి
కర్మ మార్గముతోడ కైవల్యమును పొంద తలచి ప్రయత్నించ తెలిసె సుమ్మి
నిష్ఠతో కర్మల నెఱవేర్చ లేకను భ్రష్టుడైతినటంచు బాధపడితి

తే.గీ. పరమ సులభ సాధ్యంబైన భక్తి మార్గ
మొకటె మేలంచు నమ్మితి ముక్తి బడయ ॥దివ్య సుం॥ ॥ 60 ॥

సీ. ఎంతని వర్ణింతు దంతి వరద నిన్ను మాటల కందని మహిమ నీది
సేవించలేనయ్య సేతుబంధన నిన్ను చేతల కందని చేష్ట నీది
దర్శించలేనయ్య దశరథాత్మజ నిన్ను చూపుల కందని సొగసు నీది
తెలియ వశంబేన జలజాక్ష నిన్ను నా యూహకందని యట్టి యునికి నీది

తే.గీ. అలవి కాదు నిను దెలియ నజునికైన
నల్ప మతినగు నాకేల నలవి యగును ? ॥దివ్య సుం॥ ॥ 61 ॥

సీ. నీల నీరదవర్ణ ! నీవె నా తండ్రివి జలజాక్షి జానకి జనని నాకు
నవ విధ భక్తులె నాకు హితులు సుమ్మి నాగశయను చింత నాకు మేలు
నీ భృత్యులెల్లరు నిజమైన గురువులు నీ నామ కీర్తనే నీతి నాకు
నిన్ను పొగడుటయే నిష్కళంకపు విద్య నీ కథా శ్రవణమే నిత్య వృత్తి

తే.గీ. నీకు దాస్యము చేయుటే నాకు వరము
నీకు వందనమిడుటయే నిత్య సుఖము ॥దివ్య సుం॥ ॥ 62 ॥

సీ. ఎవడో యొకడు వచ్చి భవబంధముల ద్రెంచి ముక్తి యిచ్చుననుచు మూల్గ జనులు
తానెవరో తాను తన మనమును కూడ తెలుసుకోలేనట్టి ద్రిమ్మరికద !
మంత్ర తంత్రములతో మాయగారడి చేసి జీవుల నమ్మించ దేవుడగున ?
యిట్టివారిని నమ్మి యిహ పరములను పో గొట్టుకొని తెలిసికుందనేమి ?

తే.గీ. మాయ మాటలు చెప్పి య మాయకులను
మోసపుచ్చిన వారికి ముక్తి రాదు ॥దివ్య సుం॥ ॥ 63 ॥

సీ. పాటు లేదంచు ఱంపపుకోత పడితి చే పడలేక పడుచుంటి పాటిపోక
పదిమందిలో గొప్పవానిగ భావించి చేసితి బాకీలు సిగ్గులేక
చేసిన బాకీలు చెల్లించుకోలేక బొంకులు పలికితి బుద్ధిలేక
బుద్ధితో నినుచేరి పూజ చేయంగను మానుకొంటిని నాకు మనసురాక.

తే.గీ. రోత జీవితంబు తలచిరోయుచుంటి
నెటుల బ్రోతువో బ్రతుకెల్ల జటిలమాయె ॥దివ్య సుం॥ ॥ 64 ॥

సీ. మానాభి మానముల్ మంటలో గలిసెను బాకీలవారేమొ బాదుచుండ
మోజు మొగ్గరములు బూడిదలో కల్సె తరుణి ప్రేమను వీడి తన్నుచుండ
గౌరవ మన్ననల్ గంగలో కలిసెను చుట్టముల్ ననుజూచి తిట్టుచుండ
మమత మాన్యతలెల్ల మట్టిలో గలిసెను హితులైనవారు నన్నీడ్చుచుండ

తే.గీ. మండుచుండెను గుండెల మంటలెగయ
చేరదీసి నన్నేలుకో చిద్విలాస ॥దివ్య సుం॥ ॥ 65 ॥

సీ. ఎన్నో యనుభవములెన్నో తలంపులన్ తలచి తలచి మాకు తలలు పండె?
నెన్నియో కోరిక లెన్నియో రోషాల వలలందు మునిగి మా వయసు నిండె
నెన్నియో సుఖముల నెన్నియో దుఃఖముల్ తనివిగా యెంచి మా తనువులెండె
నెన్నియో బాధల నెన్నియో నిందలన్ కలిగి కలిగి మాకు కడుపు మండె

తే.గీ. నెందుకయ్య మా బ్రతుకులనింత వెలితి
గా మలచినావు తెల్పవే కరుణతోడ ॥దివ్య సుం॥ ॥66॥

సీ. అమృతము చాలలేదని దేవతలు తాము మాటిమాటికి నీకు మనవిచేయ
కాస్త విసుగుజెంది కాబోలు విశ్రాంతి కోరి వచ్చితివ యీ కొండపైకి
చేతులు మోడ్చుచు శిరములు వంచుచు గోల చేసితిమయ్య కోపమేల ?
సమృతప్రదాతవీవని తెలిసియు మేము నిన్నెట్లు విడతుము నీరజాక్ష

తే.గీ. వెళ్ళవద్దు వైకుంఠము విమలతేజ
శాశ్వతముగ మమ్మేలుకో సార్వభౌమ ॥ దివ్య సుం ॥ ॥ 67 ॥

సీ. గోవింద ! గోవింద ! కోదండరామ ముకుందశ్రీనాథ ! వైకుంఠధామ,
యిందిరా మోహన మందస్మిత వదన ! సుందరాకార ! విశుద్ధనామ !
భక్తమందార ! ప్రభావ భాసురనామ ! సచ్చిదానంద ! ప్రశాంత తేజ !
కారుణ్యసాగర ! కందళిత హృదయ ! వందిత చరణారవింద ! కోటి

తే.గీ. వందనములు గావించు సువర్ణ వర్ణ
ముక్తిచందన మొసగవే మోహనాంగ ॥ దివ్య సుం ॥ ॥ 68 ॥

సీ. బ్రతికి చెడినవానికి తెలుసు మోహమాటము, పరువుయశము విమల మొప్ప
చెడిపోయి బ్రతికిన చెనటి నరుల కెల్ల మన్నన తెలియదు మచ్చుకైన
కక్కుర్తి పడుచుండు కడకు పైసాకైన నర్థమే తన పరమార్థ మనుచు
నిట్టి పిసినిగొట్టు హీనాతి హీనమై బ్రతుకుచుండును పెద్ద బండగాను

తే.గీ. తాను తిన డొరులకు పెట్ట తలపురాదు
కడకు కన్న వారికి కూడ కతగడేమొ ? ॥ దివ్య సుం ॥ ॥ 69 ॥

సీ. మత సామరస్యము మానవజాతికి రత్నము లొసగెడు రత్న గర్భ;
మత సామరస్యము హతమైనచో నెల్ల జాతులు క్రూరతన్ సమసిపోవు
మత సామరస్యము మితిలేని మేలును జనుల కెపుడు చేయు ఘనముగాను,
మత సామరస్యమున్ మతి మంతులెల్లరు మెచ్చుకొందురు చాల హెచ్చుగాను,

తే.గీ. మత సహనమును లేనట్టి మనుజులెల్ల
దున్నపోతులనుచు నాకు తోచుచుండె ॥ దివ్య సుం ॥ ॥ 70 ॥

సీ. వామాంక మందున వనజాక్షి జానకీ మాత వరలియుండ; భ్రాతయైన
సౌమిత్రి వినయుడై సాయుధ పాణియై సేవకు రీతిగా చేరియుండ;
కుజన భయదమైన కోదండము ధరించి దక్షిణకరమున దనుజకులము
సంకులముపడెడు శంఖ మమరియుండ వామ హస్తమునందు వైరిజనులు

తే.గీ. దారుణముగ భీతిల్లు సుదర్శనమను
చక్రముగల ప్రభువ నమస్కార మిదియె ॥ దివ్య సుం ॥ ॥ 71 ॥

సీ. నిండు పున్నమిబోలు నిండైన నీ మోము పండువెన్నెల విందు పద్మనాభ !
నిండైన నీరూపు దండి వైరులకెల్ల ప్రాణ భీతికి పొందు త్రాణపోష !
బండబారిన యెదనిండిన గుండెలన్ పంటలు పండించు పావనుడవు !
దండాలే పైన ప్రచండ చరితులైన కోదండరామ మా కోర్కెదీర్చు

తే.గీ. దండిదొరవు వంచును దండమిడగ
వేగబ్రోతువు వారిని విడువకుండ ॥ దివ్య సుం ॥ ॥ 72 ॥

సీ. తండ్రిని పూజించు తనయులందున నీవు మొదటి వాడవు కద మోహనాంగ!
భార్యను లాలించు భర్తలందున నీవు ప్రధముడవైతివి పరమ పురుష !
యనుజుల ప్రేమించున గ్రజులందున నధికుడవౌదువు ప్రథమ దేవ !
భక్తులన్ దయతోడ పాలించు వారిలో నగ్రగణ్యుడవు సమగ్ర చరిత !

తే.గీ. అన్ని విధముల నీకన్న మిన్నయైన
సుతుడు, భర్త, భ్రాత, ప్రభువు హితులు లేరు ॥దివ్య సుం॥ ॥ 73 ॥

సీ. పాలించి లాలించు పరమేష్టి నీవంచు పెక్కు శాస్త్రములెల్ల నిక్కముగను
మాటి మాటికి చాటె మేటిదైవంబని నిన్నెట్లు విడుతును సన్నుతాంగ
భవభంగ శ్రీరంగ భగవంతు డీవంచు సకలలోకములందు సాదరముగ
విఖ్యాతి బడసిన విష్ణువీవు మురారి ! నిన్నెట్లు మఱతును నిర్మలాంగ

తే.గీ. అభయమిచ్చి నన్నాదరించు భువనైక
ప్రభువు నీవు తప్ప ! యికను పరులు లేరు ॥దివ్య సుం॥ ॥ 74 ॥

సీ. సారహీనంబైన సంసార జలధిలో నాశ నిరాశల యలల మధ్య
మునిగి దేలుచునుంటి పూర్తిగా లోతున జటిలమౌ సంసార జలధిలోన
కాంతా సుతులజాడ కడు భయంకర ఘోర తిమి తిమింగలముల తీరునుండె
బంధుగణములెల్ల వక్రముల్ తక్కిన జనులెల్లరున్ విషసర్పములుగ

తే.గీ. దుర్భరము దుస్సహంబుగ తోచుచుండె
తలచుకొను కొలది కలిగె తగని భయము ॥దివ్య సుం॥ ॥ 75 ॥

సీ. కడుపు కోసమెగద ! కఠినాత్ములైనట్టి ప్రజలకు సల్పితి వందనములు
కడుపు కోసమెగద ! కాని పనులనైన చేయవలసివచ్చె సిగ్గువీడి
కడుపు కోసమెగద ! గౌరవము మఱచి పడరాని పాట్లెల్ల పడగవలసె
కడుపు కోసమెగద ! కాని వారిని కూడ కలుపుకొని మెలగవలసి వచ్చె

తే.గీ. కడుపుకోసమే మోసము కరుణవీడి
చేయవలసెను నేనేమి చెప్పుకొందు ॥ దివ్య సుం ॥ ॥ 76 ॥

సీ. యజ్ఞయాగాదులు యశముతోచేసి, నే ముక్తిగాంచెద నన్న మూర్ఖుడగును
దండిగా దానముల్ ధర్మముల్ సల్పి నే ముక్తి గాంచెదనన్న మూర్ఖుడగును
యోగ నిష్ఠలనెల్ల బాగుగా చేసి, నే ముక్తి గాంచెదనన్న మూర్ఖుడగును
భక్తి మార్గమునందు శక్తిమేరకు జేరి ముక్తిగాంచెదనన్న యుక్తుడగును

తే.గీ. జపతపముల కంటెను చాల చక్కనైన
భక్తి మార్గము మఱువతా పశువు సుమ్మి ॥దివ్య సుం॥ ॥ 77 ॥

సీ. కాశీకి పోయి కైంకర్యము చేసి, పా వనుడ నగుదు నన్న ఫలము రాదు,
రామేశ్వరమునకు రయమునపోయి, సేవింతునన్న ఫలము సుంతరాదు,
తిరుపతి కొండకు మురిపెముతో బోయి వందనంబులు సల్ప ఫలమురాదు
భద్రగిరివచ్చి భక్తితో పూజింప ఫలము వచ్చుననుచు భ్రాంతిపడగ

తే.గీ. రాదు, చెంతనున్నట్టి యీ పేదజనుల
హృదయ రాముని సేవింప కేలవచ్చు ॥దివ్య సుం॥ ॥ 78 ॥

సీ. వీధిలో తిరిగెడు వీలైన కుక్కలన్ వెట్టిపట్టినదంచు నట్టుకోయు,
నేలమీదుగ పోవు బేలైన పామును పగబట్టెనంచును బాదుచుండు,
నడవిలో చక్కగా నాటాడు కొనునట్టి మృగముల పట్టించి మెడలు కోయు,
తోటి మానవులను కాటు వేయు నరులన్ శిక్షింప బూనరే సిగ్గుతోడ

తే.గీ. క్రూర నరులకంటెను చాల ఘోరమేది ?
మూర్ఖజనుని కంటెను పెద్ద ముప్పు లేదు ॥దివ్య సుం॥ ॥ 79 ॥

సీ. ఖాండవ వనమెల్ల కసితీర భక్షింప నగ్నిహోత్రుని దప్పి యణగిపోయె,
పాలకడలిని కల్లోలము గావింప సమరుల దప్పిక యణగిపోయె,
లంక నెల్లను మంచి లక్ష్యముతో కాల్చ, నాంజనేయుని దప్పి కణగిపోయె,
భూభారమెల్లను పూర్తిగా దొలగింప నాదిదేవుని దప్పి యణగిపోయె;

తే.గీ. కాని ధన దాహమనెడు రాకాసి తాను
మిగిలిపోయి యుండెను నేడు జగతిలోన ॥దివ్య సుం॥ ॥ 80 ॥

సీ. లక్షలాదిగ డబ్బు లాఘవంబుగ పొంది పెట్టెలందుంచిన ప్రియమురాదు
కక్ష తీర్చుకొనెడు కాలసర్పములని తెలిసి మసలకున్న ఫలము లేదు
శిక్ష వేయు యముడు రక్షించు వారలు లేరంచునేడ్వగ నేరమగును
యక్షరుండైనట్టి రక్షక రాముని కీర్తించకున్నచో కీడు సుమ్మి

తే.గీ. కుక్షి మాడ్చుకొనుచు నేడు కూళవెల్ల
బిక్షగాండ్రు రీతిగను జీవించుచుండె ॥దివ్య సుం॥ ॥ 81 ॥

సీ. ఇతిగల యఖిలము కలిసి నను పిలచి వలచి మము వరించ వలయుననిన
నా మది తరబడి నగుచుపై కెగబడ, సురచిర కిరణుడగు రఘువరుని
దశదిశలనుకల యశము కనులకగు పడగ, ముసము పరిపరివిధములు
మధనపడుచు నీచనిధులను బడసిన నరకసమముగద దనయ, వలదు

తే.గీ. యిసుక కణపరిమాణము; పసరహితము
ధనము, ఘనము యశములను కనగ ననియొ॥ ॥దివ్య సుం॥ ॥ 82 ॥

సీ. కొండంత ధనమున్న కోటి పదవులున్న శాంతి లభించ దావంతయైన
సర్వాధికారమౌ సార్వభౌమత్వము కలిగియున్నను శాంతి కలుగదాయె
దొరకునా తామెంత దొరలైన వేమైన శాంత స్వభావము సాదరముగ
వీరవిక్రమములు విరివిగా నున్నను సమకూరనేరదు శాంతగుణము

తే.గీ. సర్వమంగళ రాముని స్మరణ చేయ
శాంతి లభియించు వెన్నెల కాంతివలెను ॥దివ్య సుం॥ ॥ 83 ॥

సీ. దేశ యశస్సుకై దీక్షతో జనులెల్ల మత విరోధములను మానవలయు
దేశహితము కోరి దేశీయులందరు నేక కుటుంబమై యిమడవలయు
దేశాభ్యుదయముకై దేశీయులొకటిగా నడుములను బిగించి నడువవలయు
దేశ రక్షణకై స్వదేశయువకులెల్ల నుగ్రసింహంబులై నుఱకవలయు

తే.గీ. దేశభక్తిలేని నరుడు దేశద్రోహి
యట్టివానికి కాలుడే చట్టమగును. ॥ దివ్య సుం ॥ ॥ 84 ॥

సీ. వంచకాత్ములకేల వనమాలి కథలెల్ల లంచగొండుల కేల మంచితనము ?
పిసినిగొట్టల కేల పసిడిదానములెల్ల దురితాత్ములకునేల తులసి పూజ ?
తంత్రగొట్టుల కేల దైవమంత్ర జపము త్రాగుబోతులకేల తత్త్వసిద్ధి
దుష్టాత్ములకునేల శిష్టమౌ నిష్టలు వదరుబోతులకేల పఠసమరయ

తే.గీ. జూదగాంద్రకు నెల వేన ? శుద్ధిగుణము
నీతిహీనుల కెందుకు నియమగుణము ॥దివ్య సుం॥ ॥ 85 ॥

సీ. నాస్తికులకునేల నారాయణునిలీల యాస్తికులకును దురాశ లేల ?
ధైర్యవంతుల కేల దండధర భయము శౌర్యవంతుల కేల సమరభయము
మౌనివరులకేల మానిను ల జతలు మానవీయుల కేల మర్మగతులు
కరుణాత్ములకునేల సిరిమూటలెల్లను హరిభక్తులకునేల నరమతికలు

తే.గీ. బీదజనులకు షడ్రసోపేతమేల
మూఢజనులకు నేలకో ముక్తికాంత ॥దివ్య సుం॥ ॥ 86 ॥

సీ. నాల్గు తరములకు నా యాస్తి సరిపోవు నంచు మిడిసిపాటుగాంచు నొకడు
నావంటి ధననిధి నాకలోకమునందు కూడను లేదంచు కులుకునొకడు
నావంటి విజ్ఞాని నయశీలుడెవడంచు మిడిమిడి జ్ఞానియై మిడుకునొకడు
నావంటి ప్రతిభుదే నరుడు లేడంచును తైతక్కలాడు దద్దమ్మ యొకడు

తే.గీ. సప్తసాగర వేష్టిత జగతినెల్ల
నేలినట్టి ప్రభువులకు నేమిదక్కె ॥దివ్య సుం॥ ॥ 87 ॥

సీ. జగదేక పావని జానకీదేవితో మేల్గోరు భ్రాత సౌమిత్రితో న
యోధ్యను వీడి మహోన్నతంబై నట్టి పర్ణశాలకు వచ్చి పతితులయిన
ఖరదూషణాదుల కంఠములను ద్రుంచి దుమ్ముగూడెమునందు ధూళి
ధర్మరక్షణ జేసి దయతోడ మునులను కాపాడినట్టి శ్రీకరుడ నీవు

తే.గీ. నీవు కాపాడినట్టియీ నేల యెల్ల
పావనాధికమనుచు నా భావ మలరె ॥దివ్య సుం॥ ॥ 88 ॥

సీ. నీలివర్ణపు కాంతి నిగనిగలాడంగ తెలితెల్లని జీవ దివ్వెయనగ
కోటిరవుల ప్రభ కొమరుగానమరచు నింతింతయిన రానివింతకాంతి
భూరిరేరాజుల పూర్ణకాంతికధిక ధవళమై ధగధగల్ తాల్చుకాంతి
యట్టి కాంతిని యాత్మయంచును పిలతురు జ్ఞానులు యోగులు చారుమతులు

తే.గీ. తెలియ దివ్యాత్మ మానవ దేహ మందు
నీళ్లు పాలుగ కలిసి తానిలిచియుండె ॥దివ్య సుం॥ ॥ 89 ॥

సీ. పందినై కుక్కనై పశువునై శరభమై యెలుకనై దంతినై యెలుగునయ్యు
పెద్దపులిగ చిన్నపిల్లిగా నైగొప్ప మృగరాజునై శుద్ధ మేకనయ్యు
గుఱ్ఱమై కణుజునై కొండ గొఱ్ఱె గనయ్యు కోతినయ్యును దున్నపోతునయ్యు
వృకమునయ్యు చెవుల పిల్లినై జింకనై కాంతార మందున కడువిధముల

తే.గీ. వేషములను విసుగులేక వేసి వేసి
యలసి పోతినిస్వామి నన్నాదుకొనవె ॥దివ్య సుం॥ ॥ 90 ॥

సీ. రాజునై మంత్రినై పూజారినయ్యును కవినై, విదూషక, గాయకునిగ
నధికారినై వాని యడుగులకు మడుగు లొత్తుచిన్ని భటుడే తొత్తునయ్యు
సేనాధిపతినయ్యు, సేనల మర్మములు చర్చించెడు నిగూఢచారినయ్యు,
విషకన్యనై, దుష్టవెలయాలినై నాట్య కత్తెనై పలుజన్మ లెత్తి యెత్తి

తే.గీ. యిటుల వేషములను వేసి నటన చేసి
విసిగి వేసారితిని ప్రభు పృథ్వి యందు ॥దివ్య సుం॥ ॥ 91 ॥

సీ. జటిల తరంబైన జన్మ జరా దుఃఖ జాలములో పడి చావసిద్ధ
మైనట్టి చేపనై యలసి సొలసిపోయి కొట్టుకొనుచునుంటి గట్టిగాను
యింతలో నొకడేమొ యంతకుడంచును వచ్చె జాలరివాడు, భయముకల్గె
నాదు ప్రాణములను నలిపి నలిపిపీల్చి పిప్పిచేయుచు నుండె ప్రీతితోడ

తే.గీ. మృత్యుదేవత నా మీద మిడిసిపాటు
చేయవలదంచు శాసించి చెప్పవయ్య ॥దివ్య సుం॥ ॥ 92 ॥

సీ. పతితయైనట్టి యేపడతితో నైనను పొందుకోరుట చాల ముప్పు ముప్పు
పతిత కాకున్నను పరభామతో పొందు కోరుకొనుట కంటె కొఱవినయము
బ్రాహ్మణస్త్రీల సంపర్కము వాంఛింప నగ్నితో చెలగాట మాడుటగును,
గురుపత్నితో పొందుకోరిన ద్రోహికి గతులు లేవాయె దుర్గతియె తప్ప

తే.గీ. మోహ భావముల్ కొంపలన్ ముంచి వేసి
హాని కల్గించు నెంతటి వానికైన ॥దివ్య సుం॥ ॥ 93 ॥

సీ. వెలదితో పొందు వివేక హీనులకెల్ల విందు నరకలోకమందు సుమ్మి
జూదగాండ్ర చెలిమి సుకుమారుల బలిమి శని దేవత కలిమి సమము సుమ్మి,
త్రాగుబోతుల మాట తంత్ర గొట్టుల బాట నీటిపై వ్రాతలు నిజము సుమ్మి
వదరుబోతుల చేష్ట వదలివేసిన పిష్టి రసవిహీనుల గోష్టి కసవు సుమ్మి

తే.గీ. నోటి కొక మాటగా చెల్లు నేటి కాల
మందు భక్తి పరుండు పసందు సుమ్మి ॥దివ్య సుం॥ ॥ 94 ॥

సీ. కన్నెలకమ్మని కలలెల్ల కరిగెను కట్నాల రాక్షసి కరములందు
వరుసవావిగుణము వన్నెయున్నను సొమ్ము మాత్రము లేకున్న మగడు రాడు
సౌమ్య సరసశీల సాధువతీ లలామ యైనను రాదు కళ్యాణ గీత
విత్తమనెడు దుష్ట పిత్తమున్నను చాలు దొరవంటి వరబాబు దోసిలొగ్గు

తే.గీ. నాదు బిడ్డల తండ్రులు హడలుచుండె
గుండెలందున మండెడు కుంపటనుచు ॥దివ్య సుం॥ ॥ 95 ॥

సీ. తప్పు చేయని వాడు ధరణీశులకు కూడ వెఱువబోడరయగ వీసమైన
తప్పుత్ముని యెర్గి తప్పుకుండగ కప్పు జేసిన తప్పునే చేసినట్టి
తప్పుకు లక్షలు తలచ రాజులకైన తప్పించు కొనుటకు తరముగాదు
తప్పులెల్లను చేసి దండిగా నీకును విన్నవించ నీకు వినుట తగదు

తే.గీ. తప్పుకంటె దహించెడు నిప్పులేదు
తప్పు సర్వవేళల దెచ్చు ముప్పు సుమ్మి ॥దివ్య సుం॥ ॥ 96 ॥

సీ. కాశీకిబోయి యేకాదశి వ్రతమున్న విశ్వనాధుడు చూచి వింత పడును
రామేశ్వరమునకు నీమముతో బోవ రంగనాధుడు చాల బెంగ పడును
శ్రీగిరికిన్ పోయి సేవజేసిననాడు వేంకటేశుడు తాను విసుగుపడుచు
భద్రాద్రికే వచ్చి భజన చేసిదమన్న రామభద్రుడు చాల రవ్వచేయ

తే.గీ. చెంతనున్నట్టి దీనార్త శివుని మరచి
వేఱె చోట్లను వెదకిన వెఱ్ఱియనుచు ॥దివ్య సుం॥ ॥ 97 ॥

సీ. అతి విశాలంబైన యవనిలో నాడును నేడును కలరు దుర్నీతి పరులు
శిశుపాలుడా నాడు శ్రీకృష్ణ దేవుని దుర్భాషలాడుచు ధూళిగలిసె
దంతవక్రుడు కూడ పంతంబులాడుచు హరిచేత గోల్పోయె నసువులెల్ల
నవివేకులు నిర్వికారుండగు నిన్ను తెలియలేక ఖిన్నులగుచు

తే.గీ. సత్య శుద్ధాత్మ రూపమౌ నిత్యగతివి
నీవనుచు తెలియక తాము నీల్గుచుండె ॥దివ్య సుం॥ ॥ 98 ॥

సీ. భాషాసమైక్యత భారతీయమగు. భావము ప్రజలకునే దవశ్యమాయె
పలు భావములు దేశ ప్రగతికి భంగము భావసమైక్యత జీవనాడి
జాతికెపుడును విజయమొసగెడు శక్తి భావసమైక్యత దైవ వరము
భిన్న సంస్కృతి విభిన్న మతములకున్ భావ సమైక్యత బంధనంబు

తే.గీ. కనుక భావసమైక్యత కంటె గొప్ప
సుగుణ మొక్కటియును లేదు చూడగాను ॥దివ్య సుం॥ ॥ 99 ॥

సీ. శ్రీరామ చంద్రమూర్తి సుజనవంద్యుడు దనుజభంజను డంచు ఘనతగాంచె
యినవంశ తిలకుండు యిందీవరాంగుండు భక్త సులభుడంచు ప్రణుతిగాంచె
సీతామనోనాథు శ్రీవత్స చిహ్నుండు ధీరోత్తముడనుచు పేరుగాంచె
కౌసల్య తనయుండు కరుణా సముద్రుండు రామదాసుల కెల్ల రక్ష గాంచె

తే.గీ. ఎట్టి కష్టము లొచ్చినన్ యిట్టి ప్రభుని
గట్టిగా నమ్మి కొనిన సద్గతియె కలుగు ॥దివ్య సుం॥ ॥ 100 ॥

సీ. పవమాన సుతుడతి భక్తితో సేవించు పాద కమలములన్ పావనమని
పట్టి పూజించెద పవలురే యనకుండ నూర్మిళనాథుండు కూర్మితోడ
కడుభక్తి పూజించు కమనీయ చరణముల్ పట్టి సేవించెద గుట్టుగాను
వైదేహిముదముతో వందనంబులు సల్పు పాదములకు నేను సాదరముగ

తే.గీ. శిరముతో మ్రొక్కెదను నీదు సేవకుడను
వేగ రక్షించ రావయ్య విమల చరిత ॥దివ్య సుం॥ ॥ 101 ॥

సీ. శాంతమూర్తి వినీవు శాంతి దాతవు నీవు నీతినేతవు మోక్ష నిధివినీవు
నిర్యాణ పథమీవు నిజమునీవు, విశేష చరితుడ వీవు ప్రచండమీవు
సర్వజ్ఞుడవు నీవు సర్వలోక విదిత ఘనరహస్యమునీవు గతివి నీవు
సుగుణమూర్తి వినీవు సుజనవంద్యుడవీవు గుణరహితుడవీవు గూఢవీవు

తే.గీ. సర్వ విజ్ఞానమూర్తివి సాధు వీవు
గర్వరహితుట వీవు శ్రీకరుడ వీవు ॥దివ్య సుం ॥ ॥ 102॥

సీ. సంతోషచిత్త నీ సాలోక్య మీవయ్య సరసిజనాభ విచార రహిత
సర్వమనోహర సామీప్య మీయవే సతతమునీ దాసజనుడ నేను
సాధుజనవరద సారూప్య మీయవే నిన్నె నమ్మితిగద నిర్మలాంగ
సర్వభూతహిత నీ సాయుజ్య మీయవే నీకుక్కైమొద్దు పునీత నేత

తే.గీ. ధరను నీవంటి కరుణార్ద్ర దైవమేడి ?
నీవుగాకున్న నన్నేలు నేత లేదు ॥దివ్య సుం॥ ॥ 103 ॥

సీ. పరుమత సహనము పరమ పదప్రదము పరమత ద్వేషము నరక సమము
పరధన చింతన నిరతాగ్ని సమమౌను పరభామ పొంతన పాపమగును
పరజన విభవము పరికించి కుమిలి పరితపించు బ్రతుకులోహితము లేదు
పరజనులకు గల్గు ప్రతిభ యశము గాంచి పరితపించుటయన పాడిగాదు

తే.గీ. పరులు జేసెడు తప్పులన్ పట్టి పట్టి
చూపువానికి తెలియదు సుగుణ మెపుడు ॥దివ్య సుం॥ ॥ 104 ॥

సీ. అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడైన రామ దేవునకు ప్రణామమిదియె
వేద వేదాంగ కోవిదుడైన కోదండ రామచంద్రునకు ప్రణామమిదియె
శరణన్న వారికి కరుణతో లాలించు రామమూర్తికి నా ప్రణామ మిదియె
యేకపత్నీవ్రతు సాకేతు పురవాసు రామభద్రునకు ప్రణామ మిదియె

తే.గీ. నారమూర్తి రామునకు ప్రణామమిదియె
ప్రేమరాశి రామునకు ప్రణామమిదియె ॥దివ్య సుం॥ ॥ 105 ॥

సీ. మానవత్వంబను మంచికులము నాది, మమత చాటిన రామమతము నాది
దేవుడు గలడంచు దెల్పు థాదమునాది విష్ణునే సేవించు వృత్తి నాది
వేదవేద్యుని విన్నవించు మనసు నాది చక్రిని చింతించు చదువు నాది
పేదల కరుణించు ప్రియ చిత్తము నాది దాసులు నడిచెడు దారి నాది

తే.గీ. భక్త జనులకు తలచెడు బ్రతుకు నాది
ముక్తి కోరుకొనెడు లెస్సయుక్తి నాది ॥దివ్య సుం॥ ॥ 106 ॥

సీ. వసుధ దేవవరపు వంశము సుజనుడు తండ్రి వెంకటచలమ్ తల్లి నాగ
రాజగు నా పేరు రాఘవు లందురు మహిని గోదావరీ మండలమున
సిరి కాపురమను ఢిర్యాకు పెద్దదే గొల్ల-ప్రోలను మంచి పల్లెనాది
ప్రస్తుత వాసంబు భద్రాచలమునందు నిగమ వినుతుని సన్నిథిని కల్గె

తే.గీ. రామ కృపతోడ శతకము రచన చేసి
రామ నామాంకితము చేస్తి రమ్యమొప్ప ॥దివ్య సుం॥ ॥ 107 ॥

సీ. సంతసంబుననిట్టి శతకములనెపుడు చదివిన వినిన ప్రశాంతిగల్గు
ముద్దుగా ఇందున్న పద్దెములను మాటి మాటికి చదువు సామాన్యులకు
దివ్య విజ్ఞానము నవ్యాతి నవ్యమై వరియించు చుండును భవ్యమొప్ప
సకల శాస్త్రములకు సారాంశమిదియని పూజించు జనులకు ముక్తిగల్గు

తే.గీ. భారతీయులందున సౌమ్యభావములను
పెంచు నీ శతక పఠన మెంచగాను
దివ్యసుందర ధామ దేదీప్య నామ
భద్రగిరి ధామ శ్రీరామ! భవవిరామ! ॥ 108 ॥



#  రామచాపస్తవః 

- శ్రీ రామభద్ర దీక్షితులు

శ్లో॥ యన్మూలే రఘునందనస్య జగతాం త్రాతేతి కీర్త్యంకురో
దేవీచార్చతి జానకీ సవినయంయద్గంధపుష్పాక్షతైః ।
యత్కోట్యాకృతలాంఛనంచ జలధౌ సేతుర్జగత్పావనో
భద్రాయాస్తు జగత్త్రయస్తుతిపదం తద్రాఘవీయం ధనుః ॥ ॥1॥

శ్లో॥ యః శత్రుంజయ కుంజరేశ్వర శిరః సంఘట్టనా కర్కశే
వైదేహీ కుచకుంభపత్రమకరీ విన్యాస వైజ్ఞానికే ।
చంచత్పంచవటీకుటీరజటిలవ్యూహాయ దత్తాభయే
పాణౌ కౌణపవైరిణో విజయతే చాపాయ తస్మైనమః ॥ ॥2॥

శ్లో॥ దారుణ్యప్యవలంబితే కృతవతః సాకేతరాజ్య శ్రియం
కేళిన్యాసవిధూత గౌతమవధూదుఃశీలమూలైనసః ।
పాదస్యాక్రమణేన పూతమసకృత్కోటౌ గుణారోపణే
చాపం చంద్రవతంస చాపమథితుర్దేవస్య సేవామహే ॥ ॥3॥

శ్లో॥ మద్రక్షాకథనేచ్ఛయేవ గతయా దేవస్య కర్ణాన్తికం
మౌర్వ్యామార్గణపక్షపాత ఘటనా పారీణయా సంగతమ్ ।
కోటౌచామరహేమ భూషణ మిషాత్కీర్తి ప్రతాపాంకురైః
బిభ్రాణం కరవాణి రావణరిపోశ్చాపం శరణ్యం ప్రభోః ॥ ॥4॥

శ్లో॥ లబ్ధోన్మేషవిశేషభీషణ శిఖిజ్వాలాజటాలేక్షణ
శ్లిష్టాభ్యన్తర రుష్టరుద్రనిటిల స్నిగ్ధం విశుద్ధ్యైగిరామ్ ।
అంతః సంతతకాంచనాంచిత శరశ్రీమంజరీపింజరీ
భూతంభాతుపురః కబంధమథితుర్జ్యా బంధవామంధనుః ॥ ॥5॥

శ్లో॥ కళ్యాణం వితనోతునః కరుణయా కాకుత్థ్స చూడామణే
శ్చాపః కోపదురాపరుద్రవికటభ్రూవల్లరీ విభ్రమః ।
యత్రోద్ఘాటితనైటిలేక్షణ పుట ప్రోద్దామ ధూమధ్వజ
జ్వాలావల్లి విడంబడంబర మయత్యాపింజరా శింజినీ ॥ ॥6॥

శ్లో॥ కర్షద్దక్షిణపాణిలగ్న సశరజ్యావల్లి చక్రీకృతం
గృహ్ణద్వామకరాంగులీయకమణిచ్ఛాయోల్లసల్లస్తకమ్ ।
సంరబ్ధస్య నిషేదుషో రఘుపతేరాలీఢ భంగ్యారణే
ధావ ద్రాక్ష ససైనికాక్షి విషయం క్షేమాయ చాపం భజే ॥ ॥7॥

శ్లో॥ భాస్వచ్చంద్ర కలాగ్రమాశరకులా సృగ్లోహితాంగం బుధ
ధ్యేయం చిత్ర శిఖండజాత ఘటితం వాల్మీకి కావ్యస్తుతమ్ ।
మందస్యాపి మతి ప్రదం ప్రణమతో బాణం రణే బిభ్రతే
శ్రీరామస్య శరాసనాయ శిరసిన్యస్యే నమస్యాంజలిమ్ ॥ ॥8॥

శ్లో॥ భద్రం యచ్ఛతి పాపమత్తి భణితిం దత్తేయశః పుష్యతి
ప్రాగల్భ్యం వివృణోతి తస్యనువతి స్వం యోనరః సూక్తిభిః ।
యో దేవాన్విరుణద్ధి విప్రకురుతే విప్రాన్ని గృహ్ణాతి తం
చాపం దాశరథేరితి శ్రుతవతా సంసేవ్యతే తన్మయా ॥ ॥9॥

శ్లో॥ ఆస్తామింద్రయమాది దిక్పతికులం తిష్ఠన్తు దేవాస్త్రయో
దేవోవా రఘునందనో విహరతు స్త్పైరం సమం సీతయా ।
అస్మాకంతు శరణ్యమస్తి పరమం తత్కించన ప్రాణినాం
కోటి స్పృష్ట పయోధిసేతు సలిలైరేనః పునానంధనుః ॥ ॥10॥

శ్లో॥ అన్యే కేళి గృహీతకాళియ ఫణారంగస్థలీనర్తన
క్రీడామర్దల వాద్యహృద్య యమునా కల్లోల కోలాహలే ।
దేవే ప్రేమ వహన్త్వహంతు కుతుకీ కాకుత్థ్స హస్తద్వయీ
రంగోత్సంగనటే ధనుష్యరిభటా క్రందోరుభేరీరవే ॥ ॥11॥

శ్లో॥ కాలవ్యాల కపాలజాల ఘటిత స్రగ్భారఘోరం పరే
రుద్రం భద్రతృషావిషాదకృత ధీలోపా వృథోపాసతామ్ ।
శ్రీమచ్చామరబద్ధ మృద్ధసుషమజ్యావల్లికావేల్లితం
దధ్యాం బుద్ధిమహంతు రాక్షసచమూహన్తుః ప్రణన్తుంధనుః॥ ॥12॥

శ్లో॥ ధావంధావమ బంధగంధ గజవద్వింధ్యా ద్రివంధ్యాటవీ
కల్పేఽ పృత్ర జగత్రయేసర ఇవస్నాతుం మమేదం మనః ।
నన్వన్విష్యతి ధన్వ మన్వభినజోత్తంసస్యహంసచ్ఛద
స్వచ్ఛోద్గచ్ఛదభీశుపేశల శిరోబద్ధోచలచ్చామరమ్ ॥ ॥13॥

శ్లో॥ ధర్మం నిర్మలమాప్నుయామితి తథా విందేయ మందేతరా
నర్థానిత్యహమత్యయే దివి వధూర్భుంజీయ మంజూరితి ।
బ్రహ్మానంద విధాయినీర్మమ పునః ప్రామాణ్య వాచామపి
ధ్యాతవ్యే రఘునందనస్య ధనుషి త్రేధామనోధావతి ॥ ॥14॥

శ్లో॥ నాహం యష్టుమలం భవామి నఘటే దాతుం దనాన్యర్థినాం
కాశక్తిర్మమ దృశ్యతే తపసితుం దుర్నిగ్రహే మానసే ।
ఆత్మజ్ఞాన మవాప్నుయామితి తథాప్యారాధమేయం గిరా
వారాశి స్మయఘస్మరాస్త్రమహసో వీరస్య సారంధనుః ॥ ॥15॥

శ్లో॥ మాతుర్గర్భ కుటీర మర్భకతనుః సంప్రాప్యకంప్రాయశో
నోజన్మాని కియన్త్యగాహిషి కియద్దుఃఖంచ నాజ్ఞాసిషమ్ ।
దిష్ట్యా సంప్రతి జాయతే మమ నృణాం జన్మాత్యయ ధ్వంసనే
చాపే చంద్రవతంస చాప మథితుర్దేవస్య భావః స్థిరః ॥ ॥16॥

శ్లో॥ వల్గన్మన్దర శైలమూల ముఖర క్షీరోదపూరోదర
క్షిప్తానర్గలనిర్గలన్నవ సుధామాధుర్యదుర్యాగిరః ।
నిర్గచ్ఛన్తు నిసర్గవేగవిధుతస్వర్లోక కల్లోలినీ
గర్వాఃశర్వ ధనుర్విమర్దనధనుః స్తోత్రాయవక్త్రాన్మమ ॥ ॥17॥

శ్లో॥ కాలోన్మీలదమందకుందముకుల స్పర్ధా నిబద్ధాదర
ప్రౌఢోదారపర ప్రబంధ రచనా పాండిత్యనాడింధమమ్ ।
అస్తు ప్రస్తుత దుర్ఘటస్వమహిమ స్తోత్రస్యమేత్రస్యతః
ఖేదచ్ఛేదకృతాదరం భగవతశ్చాపం రుచా బంధురమ్ ॥ ॥18॥

శ్లో॥ గౌరీతాత గిరీశ మంజులదరీ కేలీ ధురీణామరీ
వీణోరీకృత వైఖరీ మధురుురీ పారీణరీతి క్రమమ్ ।
మారీచారి ధనుః సరీసృపపురీ నారీజనైరీడితం
సారీకృత్య సరీసరీతు హృదిమే భూరీర్వచోమంజరీః ॥ ॥19॥

శ్లో॥ చిత్రస్వీయ చరిత్ర చింతన సుధాకృష్టాయ తుష్టూషవే
మహ్యం స్నిహ్యాతు దాతు ముక్తిమవనీ పుత్రీశమిత్రం ధనుః ।
శ్లాఘాదోలిత చంద్రచూడమకుటీ విభ్రామ్యదభ్రాపగా
పాథః పాతగృహీతగర్వగిరిజా నేత్రాన్త పాత్రీ కృతామ్ ॥ ॥20॥

శ్లో॥ పాపార్థ స్మరణేన జాతుజనితం పాపం కృపాపక్ష్మలో
గౌరీకాన్త శరాసనాన్తకధమర్దూరీకరోతు (ద్రుతమ్) ।
నైవం చేత్క థ మేష భీషణ దవ జ్వాలాకరాలాటవీ
విక్రామ్యధ్భవచక్ర నిగ్రహవిధౌ ప్రాగల్భ్యా మభ్యేతుమే ॥ ॥21॥

శ్లో॥ శస్త్రాచార్య భుజంగ భూషణ ధనుర్భంగ ప్రసంగ శ్రవ
ప్రాదుర్భూతరుషః కరాద్భృగు పతేర్యద్ధృహ్ణాతి ప్రేయసి ।
ఈర్ష్యారోషకషాయితా దరదలత్కల్హార గర్భశ్రియో
జానక్యా నిహితా దృశో హృది వయం తత్కార్ముకం కుర్మహే॥ ॥22॥

శ్లో॥ సంక్షోభూయ కుతూహలేన గగనే స్థిత్వాముహుః పశ్యతాం
సంతాన ద్రుమపుష్పవృష్టయ ఇవ స్వర్గౌకసాం దృష్టయః ।
యత్ర క్షత్రియ కంఠలా విపరశోర్వీరా దుపాత్తేఽ పత
న్మర్యాముత్తర కోసలేంద్ర ధనుషే తస్మై ప్రణామాంజలిమ్॥ ॥23॥

శ్లో॥ హేలాకాలముహూర్తస్పృహిత కమలా చేలాన్త దృశ్యస్తన
శ్రీఖండద్రవ ముద్రితాచ్యుతకరస్పర్శ స్ఫురత్సౌరభమ్ ।
శశ్వద్ధృష్టితిలంభసంభవమనః శర్మణ్యధర్మేమమ
ప్రావణ్యం ప్రణుదేద్ద్వి దేహతనయా ప్రాణేశ బాణాసనమ్ ॥ ॥24॥

శ్లో॥ త్రాసోద్భ్రాన్త శకున్త సంతతి జవవ్యాధూత చూతాటవీ
శాఖా శేఖర మంజరీ పరిగలన్మాధ్వీ నిషిక్తాధ్వని ।
గోదావర్యుపకంఠ సీమ్ని కుహనా గోకర్ణ హత్యైగుణం
యస్యారీరణదీశ్వరో రఘుభువాం తద్ధన్వ మన్యేగతిమ్ ॥ ॥25॥

శ్లో॥ పశ్చాత్పశ్యతి బాణపాతచకితే శశ్వన్ని వృత్త్యాననం
విద్రాణే కుహనామృగే వికిరితుం బాణోయదారోపితః ।
దేవేన శ్రవణాన్త కృష్టకపిలజ్యావల్లి తత్కార్ముకం
కేకాగర్భిత కంఠకాననశిఖ ప్రేక్షాపదం పాతు నః ॥ ॥26॥

శ్లో॥ వేగభ్రంశిత వృక్షనీడ విహగ వ్యాకీర్ణ విద్రావిత
క్రీడాద్రోహిత పంక్తి దర్భకవల వ్యావృత్త మత్త ద్విపమ్ ।
ద్రాగుత్థాపిత సుప్తకేసరి జనస్థానే ఖరాయోధనే
జ్యాఘోషం జహతి ప్రభోర్ధనుషిమే చేతో ముహుర్ధావతి ॥ ॥27॥

శ్లో॥ వీర్యోత్సిక్త ఖర ప్రయుక్త సమర ప్రక్రాన్త చక్రభ్రమీ
చంచత్కాంచన పంజరోదర చర శ్రీరామకీరార్భకే ।
ధావత్యేవ మనో వినోదరసికం దిక్షు ప్రవిక్షిప్తయా
విష్వగ్ఘట్టిత హేమపట్ట కపిశే చాపే రుచాపేశలే ॥ ॥28॥

శ్లో॥ త్రాసోల్లాస విలోలలోచన నదీపర్యన్త నిర్యన్మృగీ
ఘాసగ్రాస నిరాసశాసన గిరా జ్యా గర్జితేనోర్జితే ।
కీశాధీశ వినాశసాశయశర వ్యామోక్షభీమోద్యమే
శ్రీమద్రామ శరాసనే సరతి మే భద్రాయ భద్రామతి ః ॥ ॥29॥

శ్లో॥ తద్దిగ్భాగ నివిష్టదృష్టి మచిర వ్యాపన్న దోర్విక్రమం
చేతః స్ఫీతభయ ప్రరోహముదిత ప్రత్యంగరోమోద్గమమ్ ।
ఉద్యద్గద్గద కంఠ నాద మురసిద్రా"జ్‌న్యస్త" తీక్ష్ణాశుగం
కుర్వద్వ్యాలిన మాహవే భగవతా కృష్టజ్యమీడే ధనుః ॥ ॥30॥

శ్లో॥ చంచ్చామరదామరశ్మిహసి తైర్వ్యాప్తోదరౌదన్వత
త్వంగత్తుంగ తరంగర్వగరిమ ప్రధ్వంస సంసూచనమ్ ।
కోదండం కలిఖండనాయ కల్యే రామస్య భీమస్యత
త్ర్యిప్తోద్దీప్త శరాగ్రజాగ్ర దనల జ్వాలా కరాలాంబరమ్ ॥ ॥31॥

శ్లో॥ యన్మౌర్వ్యామిషు మోచనాయ జలధావాస్ఫాలితాయాం ప్రభో
రంగుల్యా చిరకాల విస్మృతమహీ కన్యాకుచ స్పర్శయా ।
టంకారో నిరుణద్ధి కర్ణ వివరాణ్యన్యాని దిగ్దన్తినాం
శుండా దండ ముఖేన గాఢపిహితాత్తన్మే శరణ్యం ధనుః ॥ ॥32॥

శ్లో॥ వేలాశైలగుహా విహారి వనకర్యాదాన మోదాకుల
క్రామద్భీమ విలాసకేసరి ముఖవ్యాకర్షణైక కక్షమమ్ ।
తారజ్యారవముద్వ మద్రచయితుం భవ్యం శరణ్యం పయో
రాశిం మే శివలంభకం భవతు తద్దేవస్య తావద్ధనుః ॥ ॥33॥

శ్లో॥ కాలీయానకరాల కంఠనినదన్యక్కార లీలాసఖ
జ్యాకర్షస్తనితాత్త గంధచకిత క్రందద్దిశాదంతిని ।
గర్జన్నిర్ఝరిణీశతర్జన దశానిర్యచ్ఛరే ధీరియం
సీతా కాన్తకరాన్త కేళిసదనే కాండాసనే ఖేలతి ॥ ॥34॥

శ్లో॥ పారావార తటీకుటీర విటపిస్త్యాయత్కులాయస్థిత
శ్యేనోడ్డీన విధానకేళిరసిక జ్యాఘోషణాఘోరయా ।
వారి ప్రేరిత సాయకాయత శిఖాచక్ర త్రుటన్నక్రయా
భాస్వద్వంశ వతంస చాపలతయా నూనం మనోనన్దతి ॥ ॥35॥

